సేన, గణనాథ

# హిందూవిశ్వవిద్యాలయము ఆయుర్వేదప్రశస్తి

చెన్నపురి, 1916

Record no. 402

Sēna, Gaṇanātha

Hindūviśvavidyālayamu
āyurvēdapraśasti

Cennapuri, 1916

Record no. 402

## Bibliographic Record Target

సేన, గణనాథ.

హిందూవిశ్వవిద్యాలయము ఆయుర్వేదప్రశస్తి / గణనాథసేన్ నాంగ్లభాషయందు విరచితము ; డి. గోపాలాచార్యులు నాంధ్రీకృతము.- చెన్నపురి : Ayurvedic Printing Works, 1916.

(2), 56 p. : port. ;18 cm.

Record no. 402

Sēna, Gaṇanātha.

Hindūviśvavidyālayamu āyurvēdapraśasti / Gaṇanāthasēn Nāṅglabhāṣayandu viracitamu ; Ḍi. Gōpālācāryulu Nāndhrīkṛtamu.- Cennapuri : Ayurvedic Printing Works, 1916.

(2), 56 p. : port. ;18 cm.

Record no. 402

Ayurvedasrama Series—11.

# HINDU MEDICINE

## AN ADDRESS

Delivered at the Hindu University Foundation Ceremony at Benares.

BY

**Mahamahopadhyaya Kaviraj Gananath Sen,**

M. A., L. M. S.

*with Telugu Translation*

BY

Vaidyaratna Pandit D. Gopalacharlu,

A. V. S., A. M. B.

*Principal, Madras Ayurvedic College and Senior Physician, Madras Ayurvedic Free Dispensary, Madras; Ex-President, Ayurvedic Congress, Malabar, All India Ayurvedic Conference, Bombay; President, All-India Board of Ayurvedic Education, Allahabad, U. P.; Examiner & Member, Text Book Committee, Ayurvedic and Unani Tibi College, Delhi, Examiner, Mysore Govt. Ayurvedic Vidwat Examinations, and, of D. A. V. College, Lahore.*

AYURVEDASRAMA, MADRAS.

1916.





MADRAS:
PRINTED AT THE AYURVEDIC PRINTING WORKS,
*55, Acharappen Street, George Town,*
AND PUBLISHED FROM AYURVEDASRAMA, MADRAS.







# హిందూ విశ్వవిద్యాలయము
# ఆయుర్వేద ప్రశస్తి.



ఇది

వారాణసీపురమున జరిగిన హిందూ విశ్వవిద్యాలయ
శంకుస్థాపన మహోత్సవసమయమున
మహామహోపాధ్యాయ కవిరాజ్, గణనాథ సేన్,
ఎమ్. ఏ., ఎల్. ఎమ్. ఎస్. గారిచే
నాంగ్లభాషయందు విరచితము.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,
ఏ. వి. యస్., ఏ. యమ్. బి., గారిచే
నాంధ్రీకృతము.

చెన్నపురి.
౧౯౧౬ సం॥
రిజిష్టర్డు - కాపిరైటు.

చెన్నపురి:

55, ఆచారప్పన్ వీధియందుగల

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులవారి

స్వకీయాయుర్వేద ముద్రాయంత్రమున ముద్రింపబడి

ఆయుర్వేదాశ్రమమున బ్రకటింపంబడియె.

# పీఠిక.

సకలకలాకోవిదులకును, సమస్తవిద్యలకును ప్రధానవిద్యాపీఠమగు వారాణసీక్షేత్రమున 1916 ఫిబ్రవరి 4-వ దినమున జరిగిన హిందూవిశ్వవిద్యాలయసంస్థాపన మహోత్సవము భారతదేశమందలి పండుగదినములలో నొకటియైయున్నది. అత్తరి ఆయాశాస్త్రములయందు పారీణతగాంచిన విద్యావిశారదులచే ప్రాచ్యప్రతీచ్యశాస్త్రముల యౌన్నత్యమును వానివిశాలతను వానిభేదములను విపులముగ దెలుపు మహోపన్యాసములు పెక్కు లుపన్యసింపబడెను. అందు ఆయుర్వేదమును, దానితత్త్వమును, అందలి విషయములను విశదపరుచు అభిభాషణమును మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్ యమ్. ఎ. ఎల్. యమ్. అండ్. ఎస్. గారిచే నాంగ్లభాషయందు జదువబడెను. ఈయుపన్యాసము ప్రాచ్య ప్రతీచ్య వైద్యవిద్యావైదుష్యముతో గూడిన వైద్యపుంగవునిచే నతినిపుణముగను విమర్శనాయుతముగను విరచితము. ఇట్టి విషయములు సామాన్యముగ నందరికిని దెలియుట యవసరమగుటచే మొదట నీ వ్యాసమును ఆంగ్లభాషయందే ముద్రించి ప్రచురించితిని. దీనిం జదివి రుచిగనిన సోదరదేశీయవైద్యులును ఇతరమిత్రులును నగు ననేకులు దేశభాషల ప్రమరించిన దేశీయవైద్య సామాన్యులకును ఇతరులకును నుపయోగమగునని కోరియుండిరి, వారికోర్కె ననుసరించి యీ పొత్తమును నా మాతృభాషయగు నాంధ్రభాషయందు మున్ముందు పరివర్తనమొనరించి యాయుర్వేదాశ్రమ గ్రంథమాలయందలి ౧౧ గుచ్ఛముగ ముద్రించితిని. పాశ్చాత్యవైద్యసాంకేతికములగు ననేకపదములను పరివర్తన మొనర్చునపుడు వానికి దగు పదములు దేశభాషల దొరకమిచే నా యాంగ్లపదములను ఆభాషయందే చూపుచు వాని యభిప్రాయము నాంధ్రభాషలో జూపినాడను.

ఆయుర్వేదమన నెద్దియో తెలియక పరిహాసము జేయువారలను ఈపొత్తము వారిసందేహములను నిస్సంశయముగ దీర్చగలదని తలచెదను. ప్రాచ్యప్రతీచ్య వైద్యవిద్యా నిపుణతతోఁగూడిన యిట్టి యుభయజ్ఞాన మిశ్రములగు గ్రంథములు పెక్కులు వెడలి దురభిమాన వైద్యుల యంధకారమును మహర్షుల జ్ఞానతేజోవిశేషముతోఁగూడిన యాయుర్వేదవిజ్ఞానము నిశ్చయముగ బోగొట్టగలదు.

ఇందు పరివర్తనము ముద్రణము మొదలగువానిచే పెక్కులోపము లుండవచ్చును. పాఠక మహాశయులు విమర్శించి తెలిపిన విధేయతతో నందుకొనుచున్నాడను. వానిని పునర్ముద్రణమున సవరించుచున్నాడను.

౧౨-౨౦-౧౬.
ఆయుర్వేదాశ్రమం.

ఇట్లు,
పండిత డి. గోపాలాచార్యులు.



# హిందూవిశ్వవిద్యాలయము

## ఆయుర్వేదము.

మహామహోపాధ్యాయ కవిరాజ. గణనాథసేన్

ఎం. ఏ., ఎల్. ఎమ్. ఎస్., గారి

# యభిభాషణము.

భో భో మహారాజా, నారీమణులారా, నరపుంగవులారా!

హిందూ విశ్వవిద్యాలయ భాస్కరోదయ సమయ విభ్రాజమాన దివ్యతేజః పుంజావృతంబగు నిక్కాలంబున నేను మీయెదుట ఆయుర్వేదవైద్యమునుగూర్చి యుపన్యసింపగల భాగ్యమును బడసితిని. భారతీయుడనని యథార్థముగ చెప్పుకొను ప్రతిమానవుడును భారతదేశ కళ్యాణమును మనఃపూర్వకముగ నభిలషించు ప్రతివ్యక్తియును గాఢతమమగు శ్రద్ధను బూనదగిన విషయములలో నిదియొక్కటి. ప్రాణసంరక్షణ దక్షమగు నీమహోన్నత ఆయుర్వేదవైద్య విద్యాశాఖను పునరుద్ధారణ మొనరించుటలో నిర్భీకముగ భిన్నములగు బహువిషయములను గమనించవలసి యుండుటచే అపూర్వమగు నిట్టి మహోత్సవసమయమున సర్వావలోకనములను సమ

గ్రముగ పరికించి విన్నవింపగల సామర్థ్యము నాకులేదను సందియము నన్నధికముగ బాధించుచున్నది. అయినను నేను నేడు మాననీయులగు పండిత మదనమోహన మాలవ్యగారి తూర్యనినాదము నాలకించియు నేనుసన్నద్ధుడను కాకున్నచో ఏమహనీయులు దయామయులై నన్నింతకాలము నుండియు అఖిలభారతాయుర్వేద పరిషదమునకును ఆపరిషదమువలన నేర్పరుపబడిన అఖిలభారతాయుర్వేద పరీక్షకసంఘమునకును చేరిన బాధ్యతలతోగూడిన కార్యములందు నియోగించిరో వారు నన్ను కృతఘ్నుడగు సేవకునిగ భావింతురని నేడు నుపన్యసించుట నావిధియని నిశ్చయించితిని. ప్రేమామయుడగు సర్వేశ్వరుడును దయాశీలురగు దొరతనమువారును మీపై నిడిన పునరుద్ధారణ మహాకార్య నిర్వహణమునందు మీరాయుర్వేద విషయమునగూడ యథాభాగముగ చూపదగిన శ్రద్ధను చూపెదరుగాక యని మీ న్యాయబుద్ధికి విన్నపించుకొనుచు నాలోపములను మన్నింప బ్రార్థించుచున్నాను. ఇట్టి యవకాశమును మీరు నాకొసంగినందులకు మనఃపూర్వకమగు వందనసహస్రము లాచరించుచున్నాను.

## —॥ దృష్టిపథమునందున్న యవధి. ॥—

భారతీయులమగు మనకు ప్రాచీన భారతశబ్దము బహుళ సూచనాభరితముగ కనంబడును. ఆశబ్దము నాశ్రయించిన మధురగానము ప్రాచీనకాలమం దుండియుండిన బహుళోత్తమ



విషయములను మనమనోనేత్రములకు గోచరింప జేయుచుండును. అట్టివి కలవనుటకు సందియ మిసుమంతయును లేదు. మహత్తమమగు నా ప్రాచీనకాలమందలి స్థితిని అంతరింపక నిలిచియున్న గ్రంథరాజములు మన కెరిగింపజాలినంతటి విజ్ఞానమునుబట్టి మనము విలోకించినచో నయ్యవి నిర్మలముగ గాక నాచ్ఛాదితములుగ మనకు గోచరమగుచున్నవి. కడలేనిశిథిలముల వరుసలును ప్రకాశమానములగు సత్యములును శిథిలగర్భగతములగు సత్యములును ప్రాచీనకాలమునందు చక్రవాళమున మహోన్నతముగ దీప్తిమంతమై నిజప్రకాశమున విశ్వమునంతయు మిరుమిట్లు గొలిపిన మహాసౌధమునందలి గృహోపరిభాగము విచ్ఛిన్నముగాగ మిగిలిన స్తంభములును మనకు గోచరమగుచున్నవి.

ఇట్టి గాఢమగు విశ్వాసమును బడసియే హిందూ విశ్వవిద్యాలయమును నెలకొల్పిరని నేను విశ్వసించెదను. గతించినదానికి చింతించుటకు మాత్రమేగాక అచటనున్న రత్నములగనులను ఇంగితజ్ఞులమై త్రవ్వుటకు మనము కంకణము గట్టుకొంటిమిగాన నామహాశయము సాకారమగుట బహుకాలము నాటి మాటగాదని మనమందరము నూహించి విశ్వసించుచున్నాము. ఆరత్నముల గనులిప్పుడుగూడ నిచట కలవు గాని యవి శిథిలగర్భములనిమిడియున్నవి. గాన నాశిథిలముల నన్వేషించుటకు మన మిపుడు మనకు పాశ్చాత్యవిద్యవలన

గలిగిన నైపుణ్యము నుపయోగింప దలంచితిమి. గాన నానిక్షేపమును మనము కరగత మొనరించుకొనువరకు మనము దీక్షనువదలువారముగాము. విరమించువారముగాము. ఆరత్ననిచయములను మరల సానబెట్టి సమృద్ధమొనరించి సర్వప్రపంచమునందలి భావిసంతతివారికిని మనము శాశ్వత నిధినొసంగ దీక్షవహించితిమి.

### —( ఆయుర్వేదవైద్యముయొక్క ఆశయములు, అర్హతలు. )—

భారతీయుల యదృష్టమున పారిభాషికమున నాయుర్వేదమనబడు నీహిందూవైద్యము శిథిలగర్భ గర్భితమయ్యును సజీవమై యుపయుక్తమును ప్రాణప్రధానమునగు సేవచేయుచున్నది. తన జన్మభూమియగు నీదేశమునం దయ్యది రోగపీడితులగు ప్రాణికోటికొరకు సానుకంపమై నేటికినిగూడ పోరు సలుపుచునేయున్నది. తక్కిన వివిధసాంప్రదాయకములగు వైద్యవిధానములన్నియు నేకమై రక్షించుప్రాణులకంటె నీవిధానము వేయిమడుంగు లధికమగు ప్రాణుల రక్షించుటయేగాక పెక్కుసారులు వైదేశిక వైద్యవిధానములు నిరుపయుక్తములైన పట్ల తాను ప్రాణరక్షకమై యీ యాయుర్వేదవిధాన మాత్మసత్తాకమును స్థిరపరచియుండెను. తక్కిన విధానము లన్నియును ఆయుర్వేద మహామాతకు విభక్తసంతానమేగాని అన్యముగాదు. ఆయుర్వేదము చిరకాలజీవియై పూర్వకాలమున నాశన ప్రబలకారణములు కలిగినపట్లగూడ వానికి లొంగక నిలువ



గలిగి యుండెను. ప్రభుత్వమువారును ప్రజలునుగూడ నిట్టి మహోత్తమమగు నాయుర్వేదార్హతలను తెస్సగా గురితింపగలిగినచో శాంత్యైశ్వర్యముల కాకరమును సుప్రకాశితమునగు ప్రస్తుతకాలమునందు వెనుకటికన్న నత్యధికోపయుక్తమగు జీవన మీవిధానమునకు లభింపగలదు. ఇట్లుచెప్పుట అతిసాహసముతోగూడిన ప్రవచనము కాదని నేనునమ్మెదను.

"ప్రాణరక్షణ మొనరింపుము" "ఐహికలాభము నపేక్షింపక ప్రాణరక్షణ మొనరింపుము" అనునదియే ఆయుర్వేదమునకు నిరంతరమును రక్షామంత్రముగనుండెను. "నీలాభముకొరకుగాక - ఐహికమగు లాభమును నీవు పొందవలెనను కోరికతోగాక రోగపీడితులగు ప్రాణుల బాధానివారణైకోద్దేశముతోడనే నీవు నీరోగులకు చికిత్సజేసి తక్కినవారికన్న మిన్న వనిపించుకొనవలెను. రోగచికిత్సను వాణిజ్య పదార్థములవలె విక్రయించువారు కాంచనమును పరిత్యజించి లోష్ఠమును గ్రహించువారగుచున్నారు." అని మహనీయుడగు * చరకమహర్షి చరకసంహితయను తనగ్రంథము చికిత్సాస్థానము ౧ అధ్యాయమున విధించెను. ఇట్టి యుదార భావములు ప్రాయికముగ ఆయుర్వేదమునందు మాత్రమే కనం

---

* "నాత్మార్థంనాపికామార్థ మథభూతదయాంప్రతి । వర్తతేయశ్చికిత్సాయాం ససర్వమతివర్తతే॥ కుర్వతేయేతువృత్త్యర్థం చికిత్సాపణ్యవిక్రయం । తేహిత్వాకాంచనంరాశిం పాంశురాశిముపాసతే॥"

బడునని తోచెడిని. ఇట్టి మహదాశయములు పఠనమాత్ర మనోహర ప్రయోజకములై గ్రంథముల నలంకరించిమాత్రమే యుండలేదు. ఈ విధానము ననుసరించి ప్రతిపట్టణమునందు గ్రామమునందు చికిత్సచేయు వైద్యులలో పెక్కండ్రు బీదలగు రోగుల కుచితముగ హితోపదేశము నౌషధమునుగూడ నొసంగుటయేగాక కొందరికి పథ్యపానములకు కావలసిన పదార్థములకొరకు ధనసహాయముకూడ చేయుచున్నారు. ఇట్టి సద్భావ సంజనకమగు ప్రత్యక్షక్రియాకలాపము భరతఖండమునందుమాత్రమే సర్వత్ర గోచరమగుచుండును. ఈదేశమున ప్రతి ఆయుర్వేదవైద్యుని గృహమును చిన్న ధర్మవైద్యశాల వలెనేయుండును. నవీనకాలమున ఆంగ్లవైద్యశాలలు చాల ప్రయోజనకరములుగ నుండుట సత్యమేయని నేనొప్పుకొనెదను. శస్త్రచికిత్సయందుగాక తక్కినచికిత్సలయందు ప్రజలకు పట్టణములందును గ్రామములంధునుగూడ ఆయుర్వేదవైద్యులే స్వకీయవైద్యమున నుచితముగ చికిత్సచేయుటలో వైద్యశాలలుచేయు సేవకంటె నధికముగ సేవను ధార్మికముగ చేయుచున్నారని నేను చెప్ప సాహసించెదను. ఇట్టి సేవావ్రతులగు వీరలను వీరలపాలిటి మహామాతయగు నాయుర్వేదవిధానమును ప్రజలును ప్రభుత్వమువారును ఆదరింపదగదా? ఇట్టివారలు హిందూ విశ్వవిద్యాలయమున నుచితశిక్షను బడయుట కర్హులను విషయమును మీరుపేక్షింతురా. ?



## — ఆయుర్వేదమనగ నేమి. —

ఆయుర్వేదమనగ ప్రాణశాస్త్రము, విశ్వవ్యాపియైనట్టియు మానవులయొక్కయేగాక జంతువులయొక్కయు వృక్షములయొక్కయు ప్రాణములనుగూడ సంరక్షించుటయే ప్రధానోద్దేశముగగల మహాశాస్త్ర మాయుర్వేదము. దీనియర్థమును వెల్లడించుటకు హిందువైద్యమనుపద మసమర్థము. ఆయుర్వేద మౌషధచికిత్సనుగురించి మాత్రమే తెలుపునదిగాదు. ఔషధ చికిత్స, శస్త్రచికిత్స, ప్రసవచికిత్స, నేత్రచికిత్స, మనోరోగ చికిత్స మున్నగు ననేకచికిత్సలను గూర్చిగూడ తెలుపునది. ఆయుర్వేదము విశేషముగ నభివృద్ధినొంది యుండుటచే నీదేశమున నొకప్పు డీశాస్త్రమునందలి § 8 భాగములను ప్రత్యేకముగ నేర్పుటకు ఆయాభాగములయందు ప్రత్యేకపాండిత్యమును అనుభవమునుబడసినవారు ప్రతిభాగమునకును ప్రత్యేక పాఠశాలలను ప్రత్యేకగ్రంథ భాండాగారములనుగూడ నేర్పరుచునంతటి మహోన్నతస్థితి ఏర్పడినది. నేనిచట వివరములను తెలుపగోరనుగాని పాశ్చాత్యశస్త్రచికిత్సా శాస్త్రమునందుపయుక్తములగు శస్త్రసాధనములన్నియును మరి పెక్కు శస్త్రచికిత్సా విధానములునుగూడ ఆయుర్వేదీయ శస్త్రచికిత్సకులచేతనే కనుగొనబడినవి.

పశుచికిత్సలోని వివిధభాగములుగూడ ఆయుర్వేదోపశాఖగనే యభివృద్ధినొందినవి. అశ్వరక్షణ చికిత్సలనుగూర్చి

§ ఆయుర్వేదాశ్రమగ్రంథమాల గుచ్ఛము 10 పేజి 24 చూడుడు.

శాలిహోత్ర సంహితయందును, పశుచికిత్సలనుగూర్చి గౌతమ సంహితయందును గజచికిత్సలనుగూర్చి పాలకాప్యసంహితయను మహద్గ్రంథమునందును వివరింపబడెను. ఈగ్రంథము లిప్పుడు గూడగలవు. పూనానగరమున ప్రకటింపబడినవి. వృక్షచికిత్స గూడ నామహర్షుల దృష్టిపథమున బడకపోలేదు. వృక్షాయుర్వేదమను పేర కొన్నిగ్రంథము లిప్పటికినిగలవు. ఆయుర్వేద ప్రచార మిట్లుండెను. ఇట్టి ప్రాణరక్షణమే దానిసంకల్పము. మన ప్రతికక్షులునుడివినట్లిది పిచ్చివైద్యమనిపించుకొనదగునా?

— సంకుచితచారిత్రక వివరణము. —

"ప్రత్యక్షశారీర" మను పేరట సంస్కృతభాషలో నేను వ్రాసిన గ్రంథమునందు వివరింపబడినరీతిని ప్రాచీనభారత సత్యచరిత్రమెప్పుడు ముగిసినదో అప్పటినుండియే నవీనభారత చరిత్రలన్నియు ప్రారంభింపబడినవి. బుద్ధునియుత్పత్తియు మహితాత్ముడగు నశోకుని పరిపాలనమును భారతదేశప్రాచీనప్రకాశమునకు తుదయగునుగాని ప్రారంభముగాదు. అంతకుపూర్వము భారతపుత్రు లొనరించిన మహత్తమ కార్యములను తెలుపు యథార్థమగు చరిత్ర మింకను వ్రాయబడవలసియున్నది. ఆకాలమునందే వైద్యశాస్త్రముమున్నగు ననేకశాస్త్రములును వాఙ్మయమును పెక్కువందల వత్సరముల పర్యంతమును చాల నభివృద్ధినొంది ఈజిప్టు, గ్రీసు, రోము, అరేబియా, మున్నగు దూరదేశములకుగూడ తనదీప్తిని ప్రసరింపచేసినవి.



అభినవచరిత్రకు పూర్వకాలమునందే భారతీయులు ఈజిప్టు దేశమునకు వలసబోవుట జరిగియుండెనని ప్రాచీనకాలమునందలి చరిత్రకారులు ప్రబలనిదర్శన పూర్వకముగ చూపియున్నారు. మిశ్రదేశమ (సమ్మిళితము)ను పదమును వారు వాడియుండుట నది ఈజిప్టుకు చెందుచున్నది. మరియు ప్రాచీన కాలమునందలి ఈజిప్టుదేశీయుల వేషభాషలు నాచారములును గూడ నందులకు నిదర్శనముగనే యున్నవి. "గ్రీసుదేశమునందలి హిందూదేశము" అను శీర్షికక్రింద పోకకు గారు వ్రాసిన అమూల్యగ్రంథమున గ్రీసుదేశమునందలి ప్రారంభనాగరకత హిందూదేశము వలననే కలిగినదని సందేహింప వీలులేని దేశీయ దృష్టాంతములవలన స్పష్టపరచియున్నారు. ఆదేశమందలి నామములును పౌరాణిక (Mythology.) సంస్కృత వాఙ్మయము నుండియే కలిగినవి. రోము నాగరికత ఇటీవల వెలసినది. అశోకుడు మున్నగు బౌద్ధరాజులు విదేశములకు పంపిన బౌద్ధమత ప్రచారకులవలననే రోము గ్రీసు దేశములవారు చాలవరకు విజ్ఞానమును బడసిరి. ప్రాచీనరోమకుల వేషభాషలును ఆచారములును ప్రాచీన భారతీయుల వేషభాషలనే చాలవరకు పోలియుండెను. అరేబియాదేశపు నాగరకత దీనికీవల కలిగినది. ఆల్బరూనీ మున్నగు చరిత్రకారులు విజ్ఞానమును భారతీయులవలననే బడసితిమని స్పష్టముగ వివరించియున్నారు. అట్టి ప్రాచీననాగరకతా నిదర్శనములుగ

ఈజిప్టుదేశమునం దిప్పుడు మమ్మి, పిరమీడు మున్నగు శిల్పవిశేషములుమాత్రమే నిలచియున్నవి రోము గ్రీసుదేశములలో నంతఃకలహములవలనను కిరాతకుల (Barbarian) దండయాత్రలవలనను తొల్లింటినాగరకత పూర్తిగ తుడిచిపెట్టుకొనిపోయినది. ఇప్పుడు ప్రపంచమునం దంతటను జాతీయతా స్థాపకులును విద్యాప్రదాతలునుగా పనిచేయుచున్నట్టియు యూరోపుఖండమునందు ద్వితీయార్ధభాగమున నివసించుచున్నట్టియు జాతులవారు చేయూతయొసంగి యుండకున్నచో ప్రాచీనములగు గ్రీసు రోము దేశము లిప్పటికి విస్మరింపబడియుండును. ఇట్లు ప్రాచీనకాలమందు సర్వనాశన సమర్థములగు మార్పులు తటస్థించినను గూడ ప్రాచీన భారత తేజమున చాలభాగ మిప్పటికిని సౌమ్యవర్తనులగు పండితుల చిన్నకుటీరములయందు సజీవమైయున్నది. విదేశములనుండి స్పర్థార్థులైవచ్చిన పరకీయవిధానముల కెందును తీసిపోనిస్థితిలో నాయుర్వేద మిప్పటికిని తలయెత్తగలిగియున్నది. ప్రాచీనప్రతిభ నిట్లువెల్లడిపరుచు నీమహద్విధానమునందు నెడ్డైన కొన్నిలోటుపాటులు కనంబడినను దృఢతమములగు ప్రాత్యక్షికకర్మప్రధానుబంధమగు (Clinical) పునాదులపై నేర్పడిన ఈ విధానముయొక్క అద్భుతప్రాశస్త్యమును వివేచకులు కాదనజాలరు.

గ్రీకులు హిందూదేశముపై దాడివెడలినది (327-బి. సి.) మొదలు నీదేశభాగ్య మనేకవిధములగు మార్పులకులో



నైనది గాన చారిత్రకవిషయములను గుదిగుచ్చి మనోనేత్రము నెదుటనిలపి తిలకించినచో ప్రాచీనప్రకాశ మింతమలినమందుట కించుకయు నచ్చెరువునొందము. ఇంత మార్పుగలిగినను ఇంత హెచ్చుగ విజ్ఞానమెటుల నిలువగలిగెననియే నిశ్చయముగ నివ్వెరజెందుము. అలెగ్జాండరు దండయాత్రజరిగినపిమ్మట దేశనాశకములగు సిథియనుల (Scythians) గుంపులును వారివెనుక నుసిళ్లపుట్టలవలె హూణసేనలు (Hunas) నుగూడ నొకటివెంట నొకటిగ నీదేశమునకువచ్చి ఘోరసంగరము లొనరించి రక్తప్రవాహములబరపి పెక్కువందల వత్సరములవరకును దేశమును కొల్లగొట్టెను ఈ కిరాతులొనరించిన ఘోరకృత్యములు చరిత్రయందు హృదయప్రకంపనముగ వర్ణింపబడినవి. దోచుకొనుటయును తగులబెట్టుటయును మితిమీరియుండిన తమఃప్రపూర్ణమగు నక్కాలంబుననే భారతీయ వాఙ్మయమునం దమూల్యభాగములనేకములు నశించినవనుటకు సందియము లేదు. (ఏ.డీ. 5-వ శతాబ్దమున) సిథియనులను హూణులను నాశనముచేసి ప్రభుత్వమొనరించిన మహాప్రతాపశాలియగు శాకరియను నామాంతరముగల యశోధర్మదేవవిక్రమాదిత్యుని పరిపాలనమునందైన నప్పటి విజ్ఞానధనులు నష్టమైనదానిని కొంతవరకుమాత్రమే మరల పూరింపగలిగియుందురు గాని (ఏ. డీ. 11-వ శతాబ్దమున) హిందూదేశమునకు ఘోరశాత్రవుడగు గజనీమహమ్మదు సేనాధిపత్యమున కిరాతులగు పారసనులు పెక్కుసా

రులు హిందూదేశముపై దాడివెడలి ఉత్తర హిందూస్థానము నంతను కఠినముగ ధ్వంసముచేయుటతో దుష్ఫలితముపూర్తిగ ప్రాపించినది. వారు పట్టణములను గ్రామములను దోచుకొని కాల్చివేసిరి. రాజ్యములను చీల్చివేసిరి. చివరకు వంగ దక్షిణ దేశములుగూడ కొంతవరకు వారిబారి కగ్గముకాకపోలేదు. అముద్రితములగు వ్రాతప్రతులలో వీరి దండయాత్రకుపూర్వమే పెక్కులు నాశనముచేయబడి యుండుటచే వీరి దండయాత్రతో తక్కినవానిలో చాలభాగము నాశనమై బహుకొద్దిగ మిగిలియుండుననుటకు సందియములేదు. అటుపిమ్మట పరిపాలించినవారిలో అక్బరు, జహంగీరు, షాజహాను చక్రవర్తులు మువ్వురును వాఙ్మయాభివృద్ధినికోరి వెనుకటివారికంటె శాంతముగ పరిపాలించిన వారగుటచే నక్కాలమున మరల స్వల్పముగ శాస్త్రములు కోలుకొనియుండును గాని హిందూమతమనిన బద్ధద్వేషముగలిగిన ఔరంగజేబు పరిపాలనము దారుణకృత్యభరితమై సంప్రాప్తమైనది. తదనంతరము దేశమందరాజకము ప్రబలినది. గాన నట్టిస్థితిలో శాస్త్రములు కళలు మున్నగువాని నభివృద్ధినొందించుట కవకాశమేలేకపోయినది. ఈ యిరువదియవ శతాబ్దమునందు సైతము బెల్జియముదేశమునందలి మహోత్కృష్ట గ్రంథభాండాగారములును విశ్వవిద్యాలయములును అభినవహూణుల (జర్మనుల) దోపిడులకును ప్రజ్వాలనములకును ఆహుతికాకుండ రక్షింపబడజాలనప్పుడు



కరదీపికలతోడను ఖడ్గములతోడను గ్రామములపైబడి, తలల నరుకుచు దహనజ్వాలల నెగయించుచు సిథియనులును హూణులును, మహమ్మదు, ఘోరీ, చెంగిజుఖాను, నాదర్షా, మున్నగువారును గవసినపుడు సాధువులు నరక్షితులగు పండితుల కుటీరములలోని వ్రాతగ్రంథములెట్లు నసింపకుండనుండగలవు? హిందూదేశ విధ్వంసకు లిట్లు సమీపమునుండి వచ్చియుండగ హిందూదేశోద్ధారకులు దూరదేశములనుండివచ్చిరి. చివరకు మహోత్కృష్టమగు పరిశోధనావసరము వచ్చినది. ప్రపంచమందలి దొరతనములలో నత్యధిక ప్రేమార్ద్రహృదయులును విజ్ఞానధనులునగు ఆంగ్లదొరతనమువారి శాంతపరిపాలనమునందు వారి దయాపూర్వకమగు ప్రోత్సాహమున కళలును శాస్త్రములు నభివృద్ధినొందుట కనువుపుట్టినది. నేడు భారతీయవాఙ్మయమునందు జరుపబడుచున్న మహోన్నత పరిశోధనములవలన దీర్ఘనిద్రనుండి హిందూదేశము మరల జాగ్రదవస్థకువచ్చుట స్పష్టమైనది.

### ప్రనష్ట వాఙ్మయము.

భరతఖండమునకు ప్రాప్తించిన కష్టదశయందు తక్కిన శాస్త్రములన్నిటికివలెనే వైద్యశాస్త్రమునకు గూడ చాలనష్టము సమకూడినది. ధీమంతులచే విరచితములైనట్టియు ప్రస్తుతమున్న గ్రంథములలోను భాష్యములలోను పేర్కొనబడినట్టియు ఉద్గ్రంథములెన్నియో కనంబడుటలేదు. ఆత్రేయాది వైద్యుల

విధానములో నాత్రేయ శిష్యులగు అగ్నివేశ, భేడ, జాతూకర్ణ, పరాశర, హారీత, క్షారపాణులను వారార్గురు రచించిన సంహితలును, విశ్వామిత్రసంహిత, ఖరనాదసంహిత, కపిలతంత్ర, గౌతమతంత్రములుమున్నగు నుత్తమగ్రంథములును నసించినట్లే కనబడుచున్నది. వీనిలో అగ్నివేశ సంహితమాత్రము ముమ్మారు సంస్కరింపబడి పునర్లిఖితమై నామమాత్రముగ గోచరిత మగుచున్నది ఇదియే సుప్రసిద్ధమగు చరకసంహిత నాబరగుచున్నది హారీతసంహిత, భేడసంహితయనునామములతో నొక కృత్రిమ గ్రంథము శిథిలముగ తంజావూరుసంస్థానగ్రంథ భాండాగారముననున్నది సమస్తవిద్యల కునికిపట్టని విఖ్యాతమగు వారణాశీ పురంబుననే ఆయుర్వేదవిశ్వవిద్యాలయమును నెలకొల్పిన రాజగురువగు ధన్వంతరియను శ్రేష్ఠుడగు శస్త్రచికిత్సకు డేర్పరచిన విధానమున నతని శిష్యులగు సుశ్రుత, పౌష్కలావత, గోపురరక్షిత,భోజ, భాలుకి, కరవీర్య, వైతరణులువ్రాసిన మహాగ్రంథములన్నియు నామావశేషములైనవి. లభ్యమగుచున్న ప్రాచీన భాష్యములందుమాత్ర మాగ్రంథనామములు గోచరించుచున్నవి. వృద్ధసుశ్రుతమనబడు నాశ్రేష్ఠగ్రంథమునకు లఘుప్రతిగ నిప్పుడు సుశ్రుతసంహితయను గ్రంథముమాత్రమున్నది. దీనియందు విషయములు సంగ్రహముగనున్నవి. దీనిని సంస్కరించి మరల పరిష్కరించియున్నారు. ఇయ్యది గ్రంథవిచ్ఛేదన కథాకథన సాధనమైయున్నది. ఈగ్రంథమును సంస్కరించి



పరిష్కరించిన గ్రంథకర్త నేత్ర, కర్ణ, నాసికా, కంఠ, వ్యాధుల చికిత్సలను విదేహమను వేరొకగ్రంథమునుండి దీనియందుచేర్చియున్నాడు. ఆవిషయములనుగూర్చి వ్రాయబడిన ఈగ్రంథమును, నిమి, కంకాయన, గార్గ్య, గాలవ, చక్షుష్య, సాత్యకి, శౌనక, కరాళ, కృష్ణాత్రేయ ప్రభృతులువ్రాసిన గ్రంథములును ఉదహరిత మాత్రములుగనే గలవుగాని సాకారములుగ లేవు. శిశుచికిత్సా గ్రంథములలో, జీవక, పర్వతక, హిరణ్యాక్షాదులు వ్రాసిన గ్రంథము లింకను కనుగొనబడలేదు. అగదతంత్రము (విషచికిత్స Toxicology)లో కాశ్యప,అలంబాయన,ఉశానస, సనక, లాట్యాయనాదులు వ్రాసినగ్రంథములలో మొదటిదగు కాశ్యపసంహిత మాత్రము తంజావూరుసంస్థాన భాండాగారమున అసంపూర్తిగనున్నదని బొంబాయివాస్తవ్యులును సుప్రసిద్ధపండితులగు యాదవజీ త్రికమజీగారు నుడివిరి. ఆయుర్వేద శాఖలలో ముఖ్యములగు రసాయన వాజీకరణ ప్రకరణములయందు పతంజలి, వ్యాఘ్ర, వసిష్ఠ, మాండవ్య, నాగార్జునులు వ్రాసిన యుత్తమ గ్రంథముల నామములుదాహరితములుగాను శాసనస్థములుగను మాత్రమే కనబడుచున్నవి. గాని ఈగ్రంథములును ఇట్టి యితరగ్రంథములునుగూడ వేయిసంవత్సరముల క్రితము వ్యాప్తముగనుండినట్లు స్పష్టముగనిదర్శనములతో కనుపరుపవచ్చును. నేనువ్రాసిన "ప్రత్యక్షశారీర"మను సంస్కృత గ్రంథపీఠికయందు వివరములువ్రాసియున్నాను. బౌద్ధమతక్షయ

మును ఆయుర్వేదవాఙ్మయక్షయము నేకకాలముననేజరిగినవని చెప్పదగును నలంద, తక్షశిలా విశ్వవిద్యాలయములయందు హేతుశాస్త్రములు (తర్కము) చికిత్సాశాస్త్రము (వైద్యము) నను రెండువాఙ్మయభాగములు ముఖ్యముగ బోధింపబడుచుండినట్లు బౌద్ధచరిత్రలుస్పష్టముగ తెలుపుచున్నవి. బౌద్ధమతమునకు భూతదయయే ప్రధాననియమమగుటచే బింబిసార అశోకాది బౌద్ధరాజులపరిపాలనమున మానవులకును జంతువులకును గూడనుచితముగ వైద్యసహాయమొనరించుట కనేకవైద్యశాలలేర్పరుపబడినవి. బింబిసారునిఆస్థానమున జీవకుడను సుప్రసిద్ధవైద్యుడుండినట్లు మనము వినుచున్నాము కుమారభాచ్యుడు లేక కుమారభృత్యుడు (Accouchea) అని ఆతడుపిలువబడుచుండెను, ఆతను ఆతని గురువగు ఆత్రేయభిక్షుడును మహానీయుడగు బుద్ధదేవునకు నాతనిశిష్యులకును వైద్యసేవచేసిరని తెలియుచున్నది. బౌద్ధసామంతులలో శ్రేష్ఠుడగు నాగార్జునుడే ప్రస్తుతమున్న సుశ్రుతసంహితను పరిష్కరించెనని చాలమంది విశ్వసించుచున్నారు. చరక సుశ్రుతులకు పిమ్మట వారితో సమానమగు కీర్తినిబడసిన వాగ్భటుడుగూడ బౌద్ధుడే. ఇతడు సింధుదేశమునందు (ఏ. డీ. 5, 6 శతాబ్దములలో) నుండియుండును. సుప్రసిద్ధములగు రసతంత్రములను (వైద్యరసాయనశాస్త్రములు) వ్రాసినవారిలో చాలమంది బౌద్ధయుగమునందే వర్థిల్లినట్లు కనబడుచున్నది.



కాని మనకాలమునందు నేనునుడివిన ఈ ఏబదిమంది పేరులలోను చాలభాగము ప్రజలకేకాక సుప్రసిద్ధాయుర్వేద వైద్యులకుగూడ క్రొత్తగానే వినంబడుట నిశ్చయము. ఉత్తమోత్తములగు మనపూర్వుల వంశీకుల మనిపించుకొనుట కర్హులమగు మనము ఈమహోన్నత గ్రంథముల జాడదీయుటకు బాధ్యులముకామా? అది మనవిధికాదా? హిందూదేశ ప్రాచీనవైద్యము (Medicine of Ancient India) అను గ్రంథమును విమర్శనాపురస్సరముగ చాలకష్టపడి రచించి మహోపకారమొనరించిన డాక్టరు హార్నలు అను ఆక్సుఫర్డుపండితుని వలెను 'బోవర' ను సుప్రసిద్ధమగు ఆయుర్వేదగ్రంథము వ్రాతప్రతిని చీనా తురుష్కస్థానమున కనుగొనిన కీర్తిధన్యుడగు లెఫ్టనెంటు బవరుగారివలెను మనమందులకు గడంగవలదా? ఇండియా దొరతనమువారి యాజమాన్యమున ప్రాచీనగ్రంథసముపార్జనమునకు పనిచేయుచున్న సర్ ఆరియలు స్టైయినుగారుగూడ మధ్యఆసియాలో వ్రాతప్రతుల నన్వేషించి ఇటీవలనే హిందూదేశమునకు వచ్చిరి గాన నిదివరకు నామమాత్రముగ మనకు గోచరమగుచున్నట్టియు ఆయుర్వేదాది వివిధశాస్త్రములకు సంబంధించినట్టియు నూతనగ్రంథములను మరల నీతడా గ్రంథసంచయమునకు చేర్చునని నేను సంతసించుచున్నాను.

## —౹ ప్రాచీనసాఫల్యము. ౹—

(Anatomy and Physiology - శారీరకభాగములు.)

ఆయుర్వేద ప్రాచీన ప్రభావమును మీలో చాలమంది వినియుందురని నేను తలంచెదను. ప్రపంచమునందు చాలభాగ మజ్ఞానావృతముగ నుండినకాలమున శస్త్ర శారీరక చికిత్సల నొనరించువారికి వైద్యవిధానమును బోధించుటకు మానవ శరీరమును విభజించవలసిన యావశ్యకత కలదని మొదట గ్రహించినవారు భారతీయులగు మహర్షులే. "శస్త్రచికిత్సను చేయగోరువారు శవమునుచితరీతిని సిద్ధపరచి నిర్ధారణమును నిస్సందియమునగు జ్ఞానమును బడయుటకు నాశవమును జాగ్రత్తగ ఛేదించి ప్రత్యంగమును పరీక్షింపవలెనని" ౨ వేల సంవత్సరముల క్రితము * సుశ్రుతుడు సంశయాస్పదముగాని ధోరణిని వివరించియుండెను. డాక్టరు పుశ్చమానుగారువ్రాసిన "వైద్యవిద్యాచరిత్ర" (History of Medical Education) మను గ్రంథమున వివరింపబడినదానిని సుశ్రుతుడు వ్రాసినదానితో పోల్చిచూడుడు. "యూరోపుదేశమునందు మధ్యయుగమున మొదటిశతాబ్దములలో శవములనుకోసి పరీక్షించుటకు మతరాజకీయ నిబంధనలు ప్రతికూలములుగానుండెను. మూఢ

* తస్మాన్నిస్సంశయంజ్ఞానం హర్త్రాశల్యస్యవాంఛతా । శోధయిత్వా మృతంసమ్యక్ ద్రష్టవ్యోఽఙ్గవినిశ్చయః । శరీరేచైవశాస్త్రేచ దృష్టార్థస్స్యాద్విశారదః । దృష్టశ్రుతాభ్యాంసందేహ మవాపోహ్యాచరేత్క్రియాః॥ (సుశ్రుత సూత్ర॥ అ-౫.)



విశ్వాసములచే సంఘముగూడ నంగీకరింపకుండెను." అని డాక్టరు పుశ్చమానుగారు వ్రాసిరి. "హిందూదేశమందలి ప్రాచీనవైద్య గ్రంథకర్తలు వ్రాసినగ్రంథములలో గోచరించుచున్న యత్యధిక ప్రత్యక్షశారీర (Anatomical) శాస్త్రజ్ఞానమును చూచుటవలన నావలెనే చాలమంది అచ్చెరువొందవచ్చును. అట్టి ప్రారంభదశను బట్టిచూచిన దానివ్యాప్తియును యాథార్థ్యమును వింతగొల్పదగియున్నవని "ప్రాచీన భారతీయ వైద్యశాస్త్రపఠన" మను గ్రంథమున డాక్టరు హార్నలుగారు వ్రాసిరి. అనాటమీనిగూర్చి నేను వ్రాసిన "ప్రత్యక్షశారీరము" అను మూలగ్రంథమున దీనినిగూర్చి పూర్తిగా వివరించియుండుటచే నిచట విస్తరింపగోరను.

## —౹ రక్తసంచలనము. ౹—

(Circulation of blood.)

రక్తసంచలనమును 17-వ శతాబ్దమున సర్ విలియము హార్వేగారు కనుగొనిరని గొప్పగ చెప్పుకొనుచుందురుగాని భారతీయులు దీనిరహస్యమునంతయును చాలస్పష్టముగ నంతకు బహుప్రాచీనకాలముననందే గ్రహించిరి. దీనికి నిదర్శనముగ నొకవచనము నుదహరించెదను (*చరకసూత్రము.30-వఅధ్యా

* తేనమూలేనమహతా మహామూలామతాదశ । ఓజోవహాశ్శరీరేస్మిన్ విధమ్యంతేసమన్తతః । యేనౌజసావర్తయత్తిప్రీణితాస్సర్వజన్తవః । యదృతేసర్వభూతానాం జీవితంనావతిష్ఠతే । యత్సారమాదౌగర్భస్య యోఽసౌ గర్భరసాద్రసః । సంవర్ధమానంహృదయం సమావిశతియత్పునః॥ ఇత్యాది.

యము) ఎంతచిత్రమో గద 2000 సంవత్సరములకుపూర్వము ప్రాచీనమహర్షులచే కనుగొనబడిన యంశము యూరోపుదేశమునందు హార్వేగారికాలము నాటివైద్యులకు విపరీతముగ కనంబడినది. దీనిని కనుంగొనిన హార్వేగారిని 40 వత్సరములు దాటిన వయిసుగల వైద్యులందరు నిరసించి పరిహసించిరి. ఆతడు కనుంగొనిన విషయమును వారిలో నావయిసుదాటిన వారెవ్వరును విశ్వసింపరైరి. (హ్యూమసుగారి ఆంగ్లదేశచరిత్రను చూడుడు History of England).

## —॥ త్రిదోషతత్త్వము. ॥—

వాత, పిత్త, కఫముల తత్త్వముగూడ మహత్తమమగు నవలోకితము గాని ఆపదములకు సరియైనయర్థము తెలియక గాలి పసరు శ్లేష్మమునని ధనాశాపరులు భాషాంతరీకరించుటచే పాశ్చాత్యవిద్వాంసులపార్థమును చేసుకొనిరి. దీనిని సాకల్యముగ వివరింపవలెననిన ప్రత్యేకగ్రంథ మొండు వ్రాయవలసియుండును గాన నిచట సంగ్రహముగ వివరించెదను. వాతమనగ నాయుర్వేద వాఙ్మయమునందు గాలియని యర్థముగాదు. మాధ్యమికసానుక్రోశకనరసముదా యాచరిత కార్యజాలమునందిముడు ('Vayu' does not imply wind in Ayurvedic literature but comprehends all the phenomena which came under the functions of the Central and Sympathetic Nervous Systems.) (మార్పుల) కంతకుగూడ నీవాయుశబ్దము వర్తించుచున్నది. (That the word 'Pittah' does not essentially mean bile but signi-



fies the function of the thermogenesis of heat-production, and Metabolism,—comprehending in its scope the process of digestion, coloration of blood and formation of the various secretions and excretions which are either the means or the ends of tissue combustion.) పిత్తమనగ కేవలము పసరుమాత్రమేగాదు. జీర్ణశక్తి, రుధిరవర్ణకారకము, (Tissue) (కణసంహతి) సంఘర్షణసాధనములుగాని ఫలితములుగానియగు వివిధత్యాజనీయగోపనీయ పథార్థనిర్మాణముమున్నగు విధానముల (Metabolism) వృద్ధిహ్రాసముల యొక్కయు ఉష్ణోత్పన్నము సమశీతోష్ణత (Thermogenesis) యొక్కయు విధానముల కీపదము వర్తించుచున్నది. అటులే కఫమనగ (and that the word 'Kapha' does not mean phlegm but is used primarily to imply the function of Thermo taxis or heat-regulation and secondarily the formation of the various preservative fluids e. g. Mucus, Synovia, etc.) శ్లేష్మమేగాదు ప్రధానముగ (Thermo taxis) లేక ఉష్ణనియమనమునకును అనుసరణముగ సంధిస్థానములయందలి కఫము ఇతరస్థలములయందలి కఫము (Mucus, Synovia) మున్నగు వివిధసంరక్షిత ద్రవనిర్మాణముమున్నగు కార్యములకే కఫమనిపేరు. పిత్తకఫ సంజనితములకుగూడ రూఢిగగాక సూచనార్థముగ నీపదములనే వాడుటకలదు కాలాతిక్రమభయంబున నీవిషయము నిచట సాకల్యముగ వివరింపజాలమికి చింతగలుగుచున్నదిగాని పరిశోధనాతత్పరుడగు విద్యార్థికి పై వివరణము కీలకము కాగలదు. ప్రాచీనులగు గ్రీసు రోమక దేశ

నైద్యులుగూడ నీపదములను ఆయుర్వేదమునుండియే తీసుకొనిరిగాని వారు వానిభావమును సరిగ గ్రహింపజాలరైరి గాన వారేర్పరచిన (Exploded Humoral theory) (త్యక్తమైన పిత్తాదిరసదోషవాదము) దానికిని వాతపిత్త కఫ సిద్ధాంతమునకును ఏకత్వమేమియు లేదని ఎల్లరును గ్రహింపదగును. ఆయుర్వేద సిద్ధాంతమునందలి సత్యమును మూల్యమును దృష్టాంతీకరించుట కవకాశము కలిగినదని నేను నిశ్చితమనస్కుండనైతిని. వ్యాధుల యుత్పత్తికిని వానిలక్షణములకును వ్యాధులనివారణమునకును సంబంధించిన దుర్గ్రాహ్యములగు కొన్ని విషయములీసిద్ధాంతమువలన సులభగ్రాహ్యములగుచున్నవి. దీనివలన సయుక్తికమగు సమాధానము దొరుకుచున్నది. ఔషధము చేయు సామాన్యమైన పనులు (General therapeutics) విధులను గ్రహించినందువలన వైద్యులకందరికిని చాలప్రయోజనముకలదు. వానినిగ్రహించుట కీసిద్ధాంతము మార్గదర్శకమగుచున్నది ఈ విషయమును నిష్కాపట్యభావముతో నవగతము చేసుకొనిన దీనియందు విశ్వాసము సులభముగ కుదురునని నేను నిర్భయముగ నుడువగలను. అసంపూర్ణ ప్రజ్ఞులగు నాయుర్వేద వైద్యులు సైతము నిత్యకృత్యమునందు రోగహేతువు ఔషధముచేయుపని పథ్యము మొదలగువాని (Ætiology & therapeutics & dietary) విధులను జ్ఞాపక ముంచుకొనినచో రోగిచెంతను చక్కగా మెలంగ సమర్థులగుదురు.



## —॥ రసతంత్రము - చికిత్సాశాస్త్రము. ॥—

## (Chemistry and Therapeutics.)

రసశాస్త్రమునందు ప్రాచీనమహర్షులు చూపిన యభివృద్ధినిగూర్చి సుప్రసిద్ధ విద్వాంసులగు కలకత్తా నివాసులు డాక్టరు పి. సి. రాయిగారిదివరకే వివరించియున్నారు. ఇట్టి యభివృద్ధి బహుప్రాచీనకాలముననే చూపబడినదను విషయమును మనము స్మరించితిమేని మనప్రాచీనులుచేసిన కార్యములలో వారుచూపిన విజ్ఞతకును వారికిగల పరిశోధనాసక్తికిని మనము వారికి వినమ్రులము కావలసియున్నది. వృక్షశాస్త్రమునందుగూడ శాశ్వతమగు నభివృద్ధి చూపించబడినదిగాని తద్విషయికమున రాఘవభట్టు, సారంగధరుడు, మున్నగువారు చేసినగ్రంథములలో నిపుడు మనదురదృష్టమున స్వల్పభాగము మాత్రమే నిలచియున్నది. వృక్షములను వారు స్థావరజీవములనివాడిరి. స్థావరజీవములనగ చలనము లేనట్టియు కష్టసుఖానుభవజ్ఞానము కలిగినట్టియు ప్రాణులు...............ఈవిషయమునే కీర్తిధనులును కలకత్తానగర వాస్తవ్యులునగు జే. సీ. బోసుపండితులు సరియైన పరిశోధనలమూలమున దృష్టాంతపరచియున్నారు. వృక్షాయుర్వేదమను వైద్యవిధానమున వృక్షముల రోగలక్షణములును వానిచికిత్సలును సక్రమముగ వివరింపబడెనని నేనిదివరకే వివరించితిని. వానిలో నగ్నిపూర్ణసారంగధరులు వ్రాసినగ్రంథము లిప్పటికిని నిలచియున్నవి.

ఔషధ సముదాయములయు ఔషధయోగముల (Materia Medica and pharmacy) విషయమున ఓషధులయు ఆహారపదార్థములయు గుణములను చక్కగ పరిశోధించి ఒకపరిభాష (Terminology)గా వివరించియున్నారు. దాని యర్థమును సరిగ నవగతము చేసుకొనినచో చాలాసందర్భములలో ఔషధముచేయుపని (Therapeutics) యందు సరియగు జ్ఞానము కలుగకపోదు గాని ఆ పరిభాష (Terminology) ను భాషాంతరీకరించినవా రర్థమును సరిగ గ్రహింపకపోవుటచే నా మూలగ్రంథ మింతవరకును సరియగు నుపయోగమునకు వచ్చియుండనేలేదు. ఔషధయోగముల (Pharmacy) ఔషధుల గుణములను (ఆసవములు, అరిష్టములు) ద్రావకములలోను ఘృత, తైల, పానీయాదులలోను సేకరించుట సుప్రసిద్ధమే. రసలోహాదుల చికిత్సావిధానము ఔషధముచేయుపని (Therapeutics) (రసలోహములనుండి మానవశరీరతత్వమునకు విగటించని సున్నితౌషధము లిప్పటికిని చేయుటయును ప్రయోగించుటయునుగలదు) చాల నభివృద్ధినొందినది. ఈయభివృద్ధి యిప్పటికిని ఆయుర్వేదౌషధ ప్రాశస్త్యమునకు హేతుకముగ నున్నది. రస గంధక సంయోజనమువలన గలిగినకజ్జలి (Black sulphide) లేక రససింధూరము (Red sulphide) లలో వలె పారదవికారములు (Mercurialism) ఎన్నడును ఏర్పడజాలదను విషయమును పాశ్చాత్యవైద్యు లిప్పటికిని యెరుగనేయె



రుంగరు. ఇయ్యది ఆయుర్వేద వైద్యులందరికిని ప్రాథమికశిక్షయందున తెలుపబడును. రసప్రకల్పితౌషధమగు మకరధ్వజమును సర్ పార్డే లూకిసుగారు మున్నగు పాశ్చాత్యవైద్యులు నిస్సంశయముగ నౌషధశక్తిని బాగుగ నెఱిగి యుపయోగించుటను నేను చూచితిని. అట్టిచో వైద్యశాస్త్రమున ప్రవేశమిసుమంతయేనిలేని న్యోగీపండితునివంటి రసాయనశాస్త్రజ్ఞులు మకరధ్వజమునందు యథార్థమగు మందులయందుగల వ్యాధిని బోనణచుశక్తులు నౌషధశక్తిప్రాశస్త్యము (Therapeutic merits) లేనేలేవని వ్రాయసాహసించుట చాలశోచనీయము. కృత్రిమసమ్మిశ్రిత పదార్థముల (Synthetical Salicylates) కన్న నైజోద్భవపదార్థములు (Natural Salicylates) ఏల నధిక ఫలప్రదములుగనున్నవో ఔషధముచేయుపనిలో బీచ్ వృక్షను కఱ్ఱనుండి (Beech wood) తీయబడిన క్రియసోటు (Meosotr - ఒకతైలవిశేషము) కంటె తారు (Coal-tar) నుండి గ్రహింపబడిన క్రియసోటు ఎందు కమూల్యముగనున్నదో రసాయనశాస్త్రజ్ఞు లనుకరణమునచేయు ఖనిజజలముల కంటె ప్రకృతి సంజనిత ఖనిజజలము లేల నధికగుణప్రదములుగ నున్నవో రసాయనశాస్త్ర మింతవరకు నిసుమంతయేని వివరింపగలిగియుండలేదు.

ఈసందర్భమున నేనొకటి చెప్పదగినదికలదు. ఇటీవల వ్రాయబడిన ఆయుర్వేద గ్రంథములలోగూడ గ్రంథకర్తలు

దేశీయ విదేశీయ భేదములను పాటింపక అమూల్యములగు ఔషధముచేయుపనుల పదార్థ (Therapuetics) గుణములు కలవిగా తోచిన విదేశీయములగు నోషధులుగూడ వాడవచ్చునని వ్రాసిరి. రేవలచిన్ని (Rhubarb) నల్లమందు. సీమసుగంధిపాల (Jamaica, Sarsa జమైకాదేశములోదొరకు నొకజాతి సుగంధపాలవేరు) మున్నగు నోషధులట్లు వాడబడుచున్నవి. (భావమిశ్రుని గ్రంథములను చూడుడు).

### —॥ ఔషధములు. (Medicine.) ॥—

పంచేంద్రియసాహాయమునను ప్రశ్నలమూలకముగను రోగస్వరూపమును నిశ్చయింపవలెనని కేవలవైద్యమున విధింపబడినది. వక్షస్థలమునందు చెవినుంచుటవలన ఉచ్ఛ్వాసనిశ్వాసధ్వనులను వినెడు విధానమువారికి తెలిసియుండవచ్చునని సుశ్రుతుడువ్రాసిన*ఈవాక్యములవలన నిదర్శితమగుచున్నది. వాయుమార్గములయందున్న శ్లేష్మమున బుడగలుదేరు వాయుధ్వనులు చెవులకు వినబడును. (సుశ్రుతసూత్రము. 5-వ అధ్యాయము) అభిన్యాససన్నిపాతము (Pneumonia) మున్నగు శ్వాసకోశవ్యాధులందు వినంబడు నైజముకాని శ్వాసశబ్దములు (Crepitations or rales) ను గురించియే ఇట్లువివరింపబడియుండును. ¶ "స్థూలనేత్రమున కగోచరమగునట్టియు రక్తమున సంచరించుచు పలువిధములగు వ్యాధులను కలిగించునట్టియు సూక్ష్మాతిసూక్ష్మములగు క్రిములుశరీరమునందుగలవు" (సుశ్రుతము. ఉత్తరతంత్రము. 40-వ అధ్యాయము) దీనినిబట్టి కుష్ఠు, మసూరికము, రాజయక్ష్మ, సన్నిపాతజ్వరము, చర్మవికారములు కలుగజేయు జ్వరములు (Tubler culosis). (Eruptive fevers) మున్నగు వ్యాధులు క్రిములవలన కలుగుననియు ఆవ్యాధులకు అంటువ్యాధుల స్వభావము కలదనియును ప్రాచీనులు లెస్సగా నెరింగినట్లు * స్పష్టమగుచున్నది.

* శ్రవణేంద్రియగ్రాహ్యః—సఫేనంరక్తమీరయన్ననిలః శబ్దానిర్గచ్ఛతి॥

¶ "సర్వాణివస్థాని సవాతానిసపిత్తాని సకఫానిసక్రిమీణిచోపదిశ్యన్తే"



జ్వరములు రాజయక్ష్మ (Phthisis) గ్రహణి (Bowel Complaints) మున్నగు పలువిధములగు నరకూటమునకు సంబంధించిన దీర్ఘవ్యాధుల చికిత్స కుపయోగింప వలెనని సూచింపబడిన యౌషధముల విధానము చాల విపులముగను యుక్తియుక్తముగను వివరింపబడినదిగాన నావిషయములను గూర్చి పాశ్చాత్యవైద్యులు మూలగ్రంథములు శ్రద్ధతోచదివిన చాల మేలును బడయుదురని నేను నిర్వివాదముగ చెప్ప సాహసించెదను. అసంపూర్తియగు భాషాంతరీకరణమును బట్టియే చరకసంహిత నట్టిదీక్షతో చదివిన ఫిలదల్ఫియా వాస్తవ్యులగు డాక్టరు జార్జిక్లార్కు, ఎం. ఏ., ఎం. డి. గారిట్లు వ్రాసిరి. నేను చరకమందలి ప్రతియధ్యాయమును (Fasci-

* "కుష్ఠంజ్వరశ్చశోషశ్చ నేత్రాభిష్యందఏవచ । ఔపసర్గికరోగాశ్చ సంక్రామంతినరాన్నరమ్॥" (సుశ్రుతనిదాన॥ అ-౮.)

culus) చదువుటవలన నొకనిశ్చితమునకు వచ్చితిని. ఆనిశ్చిత మిదియే. "ప్రస్తుతకాలమునందలి వైద్యులు (Pharmacopoea) గుణపాఠములలోని నవీనౌషధములను రసతంత్ర విహిత పదార్థములను పూర్తిగ పరిత్యజించి రోగులకు చరకుని విధానము ననుసరించి చికిత్స చేసినచో ప్రపంచమున శవవాహకుల పనియును దీర్ఘ వ్యాధులచే బాధపడువారి సంఖ్యయును చాల తగ్గిపోవుననుటనిశ్చయము ".

చికిత్సకు ప్రధానములని విధింపబడినట్టియు చక్కగ వివరింపబడినట్టియు పంచకర్మలలోనగు నిరూహ, అనువాసనల నునవి రెండు. అనగా కొన్ని కషాయములయొక్కయు తైలములయొక్కయు వివిధములగు వస్తికర్మల (Retentive enemata వలన Medications) చేయు విధానములు చాల శ్రేష్ఠములును ఫలప్రదములునగు మహావిధానములను గమనింపదగును. ప్రస్తుత కాలమునందలి భారతదేశీయ వైద్యులు దురదృష్టమున వీనిని చాలవరకు మరచిపోయి వదలియున్నారు. పెక్కు దీర్ఘవ్యాధులలో నీవిధానములు చాల మంచిగుణముల నిచ్చియున్న వని నాయనుభవమువలన నేను చెప్పగలనుగాన మనము వాని యందు శ్రద్ధవహించి అభ్యసింపవలసియున్నది. నేత్ర కర్ణ నాశికా కంఠవ్యాధులకు పలువిధములగు శ్రేష్ఠములైన కాటుకలును, ద్రావకములును, గండూషములను (Gargles) ఆవిరులును (Sprays) లేపములు, (Blisters) మున్నగునవి



యును వర్ణింపబడినవి. మరియు మిక్కిలి ఫలవంతమగు "శిరోవిరోచనము" (Errhines) అను విధానము నుపయోగింపవలెనని వ్రాయుచు దాని క్రమమంతయు వివరించిరి. పాశ్చాత్యవైద్యవిధానజ్ఞులు అనివారితములని పరిత్యజించిన దీర్ఘవ్యాధులనుగూడ నివారించుట యందీ కడపటి విధానము (శిరోవిరేచనము) చాల పనిచేసినదని నేనుచెప్పగలను. నిరంతర శిరోవ్యథ, గ్లావుకోమ, ఆప్టికు, న్యూరిటిసుమున్నగు కొన్ని నేత్రవ్యాధులలో వైద్యశ్రేష్ఠు * లీవిధానమును ముఖ్యముగ ననుసరింపదగును. The method is simply that of including Catarrh with the aid of some acrid dry or fluid Errhines (e. g. the powder or decoction of Ghosa fruits or the Luffa Bindal, Abrus Precatorious, etc.)

—॥శల్యతంత్రము. (Surgery.)॥—

శస్త్రచికిత్సయం దద్భుతమగు కృషి సలుపబడినట్లు గోచరించుచున్నది. (Amputations, Laparotomy) సూక్ష్మాంత్రము లేక (పిల్లపేగులలో నడ్డుకొనుట మున్నగు చిక్కులు కలిగినపుడు కడుపును కోయుట) (Lithotomy) (మూత్రాశయమందలి రాళ్లనుతీయుట) తలపుర్రె మొదలగు ప్రదేశముల యందలి భాగములను తొలిచి పెళ్లగించెడి (Trephining) నపాయకరములగు శస్త్రచికిత్సలనుగూడ ప్రాచీనులు తెన్నగ

* పీనసాది వ్యాధులయం దుపయోగించెడి శుష్కమగు చూర్ణములనుగాని ద్రవభూయిష్టమగు కల్కములనుగాని నాసాపుటమార్గమున నుపయోగించు విధానమే శిరోవిరేచన విధానమనదగును.

నేరింగియుండిరి. సుశ్రుతుడును వాగ్భటుడును శస్త్రచికిత్సోపకరణములను వేరువేరు భాగములుగ విభజించి చక్కగ వివరించియున్నారు. గాన వానిని శ్రద్ధతో చదువువారి కత్యధికాశ్చర్యము కలుగుటవిధి. 2000 సంవత్సరములకు పూర్వము వ్రాయబడిన గ్రంథములలోగూడ నీశస్త్రసాధనములను గూర్చి బాగుగ వివరింపబడినది. ఆవివరణగ్రంథము లిప్పుడుగూడ గలవు. నేపిల్సునందలి వస్తుప్రదర్శనాగారమున భద్రపరుపబడిన గ్రీసు రోము దేశముల శస్త్రసాధనములు హిందూదేశానుకరణము లేయనుట కెట్టిసందియము పనిలేదు. గాని మహారాజా గోండాలు థాకోరు సాహేబుగారు ఆయన ననుసరించిన కలకత్తానివాసి డాక్టరు ముఖర్జీగారు మున్నగు పాశ్చాత్యవైద్యధురీణులుకొందరు వారి భావప్రపంచముననే గాని హిందూ శస్త్రచికిత్సా ప్రపంచమున నెన్నడు వివరింపబడని విపరీతపు శస్త్రసాధనములను ఆయుర్వేదశల్యతంత్రమున గలవనివర్ణించి తక్కిన శాఖలయందువలెనే శస్త్రచికిత్సా శాఖయందును ప్రాచీనుల నగౌరవించుట చాల సంతాపకరము.

ప్రస్తుతము పాశ్చాత్యశస్త్రవైద్యులచే వాడబడుచున్న సాధనములన్నియు కొద్దిగమార్చబడిన ప్రాచీనుల సాధనములే యని ప్రాచీనగ్రంథములను చదివి నేను స్పష్టముగ వివరించి కలకత్తా సాహిత్యసభయందు కొంతభాగమును ఆరవ అఖిల భారతాయుర్వేద మహాసభయందు కొంతభాగమును చదివితిని.



(ఇప్పుడది "ఇండియను మెడికలురికార్డు"అను పత్రికయందు ప్రకటింపబడుచున్నది). ప్రాచీనులు వాడిన సింహాముఖయంత్రమునకును నవీనులు వాడుచున్న "లయనుఫోరుసెప్సు" (Lion Forceps) కును చాల పోలికగలదు. యోనిమార్గమును,గుదమార్గమును (Rectum - Vagina) పరిశోధించుటకు "యోనివ్రణేక్షణము" అను యంత్రము మధ్యద్వారమును ౧౬ అంగుళముల నిడుపును తిరుగునట్టి యుంగరములతో గూడినదిగను, నాలుగుశలాకలతో గూడినదిగను, తామరమొగ్గతో సమానమైన అగ్రభాగము గలదిగను కార్యక్రమమున కమలమువలె విస్తరించు నవకాశము గలిగినదిగనుండు యిట్టిసాధనము నుపయోగింపవలెనని వాగ్భటుడు * వ్రాసెను. "అల్లింఘము స్పెక్యులము" (Allingham's Speculum) అను నవీనసాధనము దీని ననుకరించియేయున్నది.

జననకాలమందు గర్భపిండమునకు (Foetus) గలుగు వివిధములగు నక్రమస్థితులను ప్రాచీనులు చాలనిదానముగ ప్రసవచికిత్సయందు గ్రహించియున్నారు. మరియు అక్రమప్రసవములయందు శిశువును రుజుమార్గమున (Version or turning the foetus in Utero, Embryotomy and Cæserian section) కు

---

* యోనివ్రణేక్షణంమధ్యే సుషిరంషోడశాంగులమ్ । ముద్రాబద్ధం చతుర్భిత్త మంభోజముకులాననమ్ । చతుశ్శలాకమాక్రాంతం మూలేతద్వికసేన్ముఖే॥ (వాగ్భట సూ-అ. 25)

త్రిప్పుటనుగూర్చి సుశ్రుతాది ప్రాచీనగ్రంథములలో మూఢగర్భ చికిత్సలయందు వివరింపబడియున్నది. ఆగ్రంథములు ప్రాచీన ప్రకాశమునకు స్థిరస్మారకచిహ్నములుగ విరాజిల్లుచున్నవి.

### — ప్రత్యేకశాఖలు. (Specialised branches.) —

(Hygienic Medicine) స్వాస్థ్యౌషధములలో జరావ్యాధుల నరికట్టుటనుగూర్చియు వీర్యపటిమను స్థిరమొనరించుటనుగూర్చియు వివరించు ప్రత్యేకభాగములు రెండేర్పడినవి. రసాయన వాజీకరణ భాగములని వీనిని వాడుచున్నారు. శక్తివర్ధకమే ఈచికిత్సకు ప్రధానఫలితము. దానినేవారు వైష్ణవశక్తియనివాడిరి. రేతస్సు ప్రాణధారణమున కత్యవసరమగు పదార్థము గాన దానిని స్థంభింపచేసిన శక్తివర్ధనము కలుగునని ప్రాచీనులు స్థిరపరచిరి. పాశ్చాత్య వైద్యముగూడ నిపుడిపుడే ఈ విషయముచాయ నించుక గ్రహింపమొదలిడినది. బ్రౌనుసీక్వర్టు, మెచినుకాపు వార్లమున్నగు సుప్రసిద్ధపండితులిటీవలనే దీని యావశ్యకతను చూపియున్నారు. ఈ రెండుభాగముల చికిత్సలు నింకనుకొంతవర కాయుర్వేద సంప్రదాయముననుకొంతవరకు యూనానీ సాంప్రదాయముననునిలచియున్నవి. గాన నీవిషయమున ఆయుర్వేదవిధానమున నోర్పుతో పరిశోధనములు జరుపబడవలెనని నేను వైద్యులనందరిని హెచ్చరించుచున్నాను.



### — ఆయుర్వేదముపయిక విమర్శనములకు సమాధానములు. —

### (Charges Against Ayurveda—Answered.)

ఆయుర్వేద జ్ఞానములేని ప్రతికక్షులుచేయు విమర్శనములకు నేను సమాధానముల నొసంగదలచితిని. "ఆయుర్వేదము చాలపూర్వకాలమునాటి విధానము. అది నిరాధారమును (Empirical) ప్రకృతి శాస్త్రానుగుణ్యము కానిదియు నగువిధానము. అట్టివిధానమును పునరుజ్జీవింపచేయుట చాలపొరబాటుపని" అని బొంబాయి శాసనసభలో కర్నలు జాక్సనుగారిటీవల నుడివిరని మనము వినియుంటిమి. నేను మీసముఖమున వివరించిన ఆయుర్వేద చారిత్రక సంగ్రహమును మీరు వినియుంటిరిగదా! ఆయుర్వేదమిట్టి విమర్శకు పాత్రమనియే మీకు తోచినదా? ఆధారరాహిత్యము (Empiricism) ఆయుర్వేదమునందుమాత్రమేకలదా? తక్కినవిధానములయందును లేదా? పాశ్చాత్యవైద్యులు కొయినా, శంఖపాషాణము (Arsenic, Iodides) మున్నగు నౌషధములను నిరంతరమును వాడెదరే?. ఇట్లు వాడుట శాస్త్రీయ (Rationale) మగునా? ఆమ (Autointoxication) యుక్తమగు జ్వరముచే బాధపడురోగికి ఆయుర్వేదమును బాగుగనభ్యసించిన వైద్యుడు కొంతవరకు లంఘనములను విధించును; అతిసారముచే బాధపడు రోగికి మొదట కొద్దికొద్దిగ విరేచనసాధనముచేయును; క్షయవ్యాధి (Tuberculosis) లో రోగికి పుష్టికరమగు

నాహారము నొసంగునట్లు చేయును; శోఫ (Bright's disease) పాండు (Anæmia) వ్యాధులలో లవణవర్జితాహారమును విధించును; దీర్ఘకాలమునుండియున్న అజీర్ణవిరేచనములు (Diarrhoea spruecer) కుదుర్చుటకు కజ్జలి (Black-Sulphide of Mercury) నుండి ప్రత్యేకముగ చేయబడిన రసపర్పటిని పెద్దమోతాదులుగ నొసంగి పాల పథ్యమును విధించును. ఇవియన్నియును నిరాధార (Empirical) సాధనములేనా? శాస్త్రోక్తసాధనములు కావా? యూరోపు అమెరికాదేశములనుండి కుప్పతెప్పలుగ క్రొత్తగ కల్పితౌషధములు (Patent drugs) వచ్చుచున్నవి. ఈ మందుల సంపుటీకరణమునుగూర్చి ప్రకటింపబడుచున్న ప్రకటనలు శాస్త్రజ్ఞానలేశమునుమాత్రమే సూచించుచుండును. అట్టిమందుల నిచ్చవచ్చినటుల రోగులకు విధించుట శాస్త్రోక్తచికిత్సయేనా? అవి శాస్త్రీయము (Rationale) లని సంపూర్ణవిశ్వాసముతోడనే విధింపబడుచున్నవా? "Salvarsan is the-Di-oxy-di-ami-doarseno-benzol" అనుటలో నేమి శాస్త్రీయత (Rationale) కనబడుచున్నది? చివరకు దేలునవి ప్రధానములగు (Clinical) ఫలితములే. చికిత్సాస్థిరతత్వమును పాటించినచో కొంతయానుభవిక సంప్రదాయము (Empiricism) గూడనుండుట చాల యవసరము. "వస్తువులయందు స్థిరముగనుండు గుణములుకాక తాత్కాలికముగ కలుగు గుణములు కొన్నియుండును. కేవ



లము శాస్త్రోక్తవైద్యమునే చేయువైద్యుడీగుణములవలన కలుగు లాభములను తెలియజాలడు. పరంపరాప్రాప్తములగు నభిప్రాయములన్నియును సత్యములుకాకున్నను వానిలో సత్యములు లేకపోలేదు. కావున లోకజ్ఞానముగల వైద్యుడీవిషయమును గ్రహించి చికిత్సచేయును. మరియు నొకవ్యక్తి ఎంతటి పండితుడైనను స్వల్పజీవనుడును మితశక్తియునగు మానవసామాన్యుడే యగునుగాన నాతని యభిప్రాయమున లోపములుండుటలో వింత ఏమియు లేదు. కాన నట్టి వ్యక్త్యభిప్రాయమును పారంపర్యప్రాప్తమగు లోకాభిప్రాయముకూడ దృఢపరుచుట యవసరము. పారంపర్యవ్యాప్తమగు లోకాభిప్రాయమనగ వేరువేరు కాలములందనుభవజ్ఞులొసంగిన యభిప్రాయముల సముదాయమే" అని సుప్రసిద్ధాంగ్లదేశ వైద్యశాస్త్రపండితుడును ప్రామాణికుడునగు డాక్టరు ఆల్బటు క్లిఫర్డుగారు నుడివిరి. అట్టిచో చరకప్రోక్తములలో నెచటనుగూడ లేని అసత్యమగు నిందనేల మోపవలెను? "ధీమంతుడగు వైద్యుడు వైద్యగ్రంథములలో నుదహరింపబడిన సాధికార ఔషధయోగముల (Recipes) ను మాత్రమే గ్రహింపవలెనుగాని ఎంత యుక్తియుక్తముగ నున్నను స్వబుద్ధినిర్మితములగు మందుల (Innovations) ను గ్రహింపరాదని" కర్నలు జాక్సనుగారు నుడివిరి. చరకుడీవిషయమున చెప్పినదిది కానే కాదు. ఆయన జెప్పినదేమన "ధీమంతుడెల్లవారినిగూడ తనకు

గురువులనుగానే భావించవలెను. ప్రబలశాస్త్రవు డైననుసరే ఆచరణలోనుండు ప్రసిద్ధౌషధములలో (Applied therapeutics) నందలి యుత్తమజ్ఞానము నాతడాసంగునేని గ్రహింపదగుననియే ». * "గ్రంథములలో నీయబడిన ఔషధయోగము (Recipes) లను మాత్రమే అనుసరించుచు వానిని గూర్చి ఆలోచింపనివారిని నిరసించవలెను. వారు మృత్యుదూతలతో సమానులు » అని వాగ్భటుడు వ్రాసెను. ఆయుర్వేదమున విధింపబడిన ఖనిజ వృక్షజ జంతుజములగు యౌషధముల పట్టికలో క్రొవ్వు - పిత్తము (Bile) మూలుగు (marrow) రక్తము-మాంసము - మూత్రము-గోళ్లు (Hoof) మున్నగునవికూడ చేర్చబడినందున ఆయుర్వేదమును నిరసింపవలెనని పండితులగు కర్నలు జాక్సనుగారు మరియొక కారణమును చూపిరి. (Hog's lard) ను (Adeps Porci) అనియు వృషభపిత్తము లేక గోరోచనము (Ox bile) ను (Fel Bovium) అనియును ఈరీతిగ నాపదార్థములనే మారుపేరులతో పాశ్చాత్యవైద్యశాస్త్రమున వాడుటవలన నవి పరిశుద్ధంబులుగను రుచికరములుగను మారునా ? "ఆంగ్లచికిత్సాపద్ధతి (Pharmaco-

* కృత్స్నోహిలోకో బుద్ధిమతా మాచార్యః శత్రుశ్చా బుద్ధిమతా మతశ్చాభి సమీక్ష్య బుద్ధిమతా అమిత్రస్యాపి ధన్యం యశస్యం ఆయుష్యం పౌష్టికం లౌకికమభ్యుపదిశతో వచః శ్రోతవ్య మనువిధాతవ్యంచేతి. (చరకము విమానస్థానము ౮-వ అధ్యాయము 11- పేరా.)



poea) లోని నోరుతిరుగని లాటిను పదములవలె ప్రాచీనసంస్కృతపదము లంగీకారములుకావు కావున నిట్టిమందులను విధించిన ఆయుర్వేదమును త్రోసివేయుడు. ఎముకలయందలి మూలుగుతో జేయబడినమాత్రలు (Bone - marrow Tabloids), పచ్చిమాంసరసము (Raw meat Juice), లేగదూడల కాలిమాంసపు లేహ్యము (Calf's foot jelly) మున్నగు మృదుపదములను సూచించెడు పాశ్చాత్యవైద్యక పద్ధతులనే స్వీకరింపుడు » అనునది వీరి సిద్ధాంతము. కాని మనదేశమును పరిపాలించు ప్రభువులుమాత్రము మన భాగ్యవశమున ఇట్టి విజ్ఞానమును నిరసించుటకు తగిన యుత్తమ కారణములను గలిగియున్నారు.

ఆయుర్వేదగ్రంథములలో కాలక్రమమున కొంత భిన్నమైన (Effete) విషయముచేరినది. ఆయుర్వేదమును నిరసింపగోరువారిట్టి విషయములనే చేర్చి తమకాధారముగ చూపుచుందురు. ఇట్టి విషయములను పరిత్యజించుట యత్యవసరము. కావున నేను వానినిసమర్థించుటకుగాని వానినిగూర్చి చర్చించుటకుగాని పూనుకొనను. ఇది పొట్టువంటిది. సులభముగ జీర్ణమయ్యెడి బియ్యమును గోరువారు ఊముకను త్రోసివేయురీతిని మనమీ యనర్థవిషయములను తొలగించవలెను.

ఆయుర్వేద మభివృద్ధిచెందుచున్నవిధానము కాదను నింద దేశీయులమగు మనకు వర్తింపదగినదికాని విధానమునకు

వర్తించునదికాదు. దేశమునందు శాంతియు నైశ్వర్యమును నెలకొనిన సమయములయందెల్ల నాయుర్వేద మభివృద్ధినొంది యుండెను. ఇపుడు మరల హిందూదేశమందంతటను గూడ నాయుర్వేదమునందు చైతన్యాభివృద్ధులు గోచరించుచున్నవి. ఇన్ని శతాబ్దములలో హిందూదేశమునందలి వాఙ్మయమునకు తటస్థించిన వృద్ధిక్షయములను మనము మరువరాదు. ఆయుర్వేదశక్తి పునోవృద్ధికరమగు శక్తియే. ప్రాచీనులు సంపాదించి మన కొసంగిపోయిన జ్ఞానమును భద్రపరచుచు మనము పరిశోధించి గ్రహించి ఆ జ్ఞానమును ప్రాచీననిధికి చేర్పవలెననియే ఆయుర్వేదము మనకందరికిని విధించుచున్నది. ఓషధుల గుణరూపముల నెరింగిన గొల్లలను గొల్లపిల్లలను సైత మాయుర్వేద పండితులు బహూకరించుచుండిరి. అవకాశము కలిగినపుడెల్ల వారు విదేశీయులవలన విజ్ఞానమును గడించియుండిరని నేనిదివరకే నిదర్శనములను కొన్నిటిని చూపియున్నాను. కాన నాయుర్వేదమునం దభివృద్ధిని చూపక ప్రతిపక్షులాయుర్వేదము వృద్ధివిరహితమని నిందించుచుండగ నాలకించుచు మన ముపేక్షాభావముతో నుంటిమేని మనకేగాక మన ప్రాచీనులకు గూడ మన మన్యాయప్రవర్తకుల మగుదుము. ఇట్టి నిందను తొలగించుట ఈహిందూ విశ్వవిద్యాలయమునకు విధి కాదా?

### —॥ పాశ్చాత్యవైద్యుల కొక విన్నపము. ॥—

పాశ్చాత్యవిధాన మభ్యసించిన వారిలో నాయుర్వేదమునుగూడ నేర్చుకొనవలెనను కుతూహలమును పలుసారులు



వెల్లడించిన నామిత్రులకీ సందర్భమున నొకవిన్నపము మొనరించెదను. మీ రాయుర్వేదము నభ్యసింప ప్రారంభించుటకు మున్ను సంస్కృతభాషయందు తగుమాత్రమగు పాండిత్యమును అలవరచుకొనవలెను. ఆయుర్వేదము నభ్యసించుటకు కావలసినంత సంస్కృతభాషాజ్ఞానము బడయుటకేమియు సంతశ్రమపడ నవసరము లేదు. మనకు వ్యాకరణవైచిత్ర్యము లిందుల కవసరము లేదు. చికిత్స - నిదానము - (పాథోలజీ) - మున్నగు విషయములను గూర్చిన మూలగ్రంథములను చదువుటకు నా మిత్రులలో కొందరు ఫ్రెన్సు - జర్మని దేశముల భాషలనుగూడ నభ్యసించిరి. పాశ్చాత్య వైద్యశాస్త్ర పఠనమునకు జర్మను - ఫ్రెంచి మున్నగు భాషలలో జ్ఞానమెట్లవసరమో అటులనే ప్రాగ్దేశవైద్యశాస్త్ర నిచయమును చదువుటకు సంస్కృతభాషాజ్ఞాన మవసరము. ఇపుడు ఆంగ్ల వంగాది భాషలలోనికి ఆయుర్వేద గ్రంథములను భాషాంతరీకరించిన వారు కేవలము ధనాశాపరులు. బాధ్యతల నెరుంగనివారు. వైద్యశాస్త్రము నభ్యసింపనివారు. వైద్యశాస్త్రపరిభాష వారికిసుమంతయును తెలియదు. వారు తెలుసుకొనుటకు ప్రయత్నింపనేలేదు. జర్మను ఫ్రెంచిభాషలలోని మూలగ్రంథముల నాంగ్లభాషలోనికి భాషాంతరీకరించినవారు మూలమునందలి భావములనన్నిటిని బీరుపోకుండ భాషాంతరీకృత గ్రంథములలోనికి తెచ్చియున్నారు. ఆయుర్వేదగ్రంథము లట్లు భాషాంత

రీకరింపబడలేదు. కావుననే అజ్ఞానమునకును అపార్థములకును
కారణము కలుగుచున్నది. ఈ కారణమున ప్రాగ్దేశవైద్య
వాఙ్మయమునం దభిమానముకల డాక్టరు వైజు, డాక్టరు
రాయలు, సర్ విలియం జోన్సుగార్లు మున్నగు సుప్రసిద్ధాంగ్ల
వైద్య పండితులుకూడ ఆయుర్వేదములలోని కొన్ని మహాత్మ
త్యములను సరిగ గ్రహింపజాలకుండ వ్రాసిన వ్రాతలవలన
ఆయుర్వేదమున కపఖ్యాతినే కలిగించువారైరి. కాని వారది
బుద్ధిపూర్వకముగ చేసినతప్పుకాదు. కఫ వాయు పిత్తాదివిషయ
ములను వారు సరిగ గ్రహింపజాలకపోయిరి. నిదానము చాల
నట్టియు ధూర్తులగునట్టియు హాసు మున్నగువారు ఆయుర్వేద
మును నిరసించుటకు మాత్రమే స్మరించియున్నారు. అజ్ఞా
నాంధకారమున నున్నవారు లేనిపోని భయంకర రూపముల
నెన్నిటినో భావించి భయపడుట కవకాశముకలదు. కావున
నాయుర్వేదమును చదువవలెనను కుతూహలము కలిగినవా
రిలో సంస్కృతభాషాజ్ఞానము లేనివా రిట్టి యజ్ఞానము పాలు
గాకుండునట్లు భద్రపడవలసియున్నది.

ఆయుర్వేద పాశ్చాత్య విధానములయందలి ప్రధానతత్వ
ములలో భేదమేమియు లేదు. కాని ఆయుర్వేదమునందు వాడ
బడిన యోషధులన్నియును దేశీయములు. చికిత్సావిధాన
మునగూడ కొంతభేదముకలదు. కావున రెండువిధానముల
నెరింగినవారును సరళభావముతో సహాకారులై పనిచేయుట



వైద్యాభివృద్ధికి చాలసనుకూలము. మరియును భారతీయులకే
కాక సర్వప్రపంచ వాసులకును గూడ చాల లాభకరముగ
నుండగలదు.

—) ఆయుర్వేదముయొక్క ప్రస్తుతస్థితి - సంస్కరణావశ్యకత (—

ప్రాచీనకాలమునం దాయుర్వేద మెట్టి మహోన్నత
స్థానము నధిరోహింపగలిగినను నేడుగూడ నయ్యది యిట్టి
స్థానమునందే నెలకొని యున్నదని యనుకొనుట మనలను
మనము మోసగించుకొనుటయే యగును. యథార్థముగ చెప్ప
వలసినచో ప్రస్తుతస్థితి పూర్వస్థితికి కేవలము వ్యతిరేకముగా
నున్నది. ఈ దేశమునం దాయుర్వేద వైద్యులమని చెప్పుకొను
వారు కోటానకోట్లున్నారు. కాని వీరిలో ప్రాచీనవిధానమును
సాకల్యముగ పఠించి బోధింపగలవారు మాత్రము చాలతక్కు
వగ నున్నారు అదికాక వీరిలో నింకను పూర్వాచారపరాయ
ణత్వము-అనగా విద్యను గోప్యముగ నుంచవలెనను భావము
ఇంకను వదలలేదు. ఇది తొల్లింటిమహర్షుల యుదారభావము
నకు కేవలము వ్యతిరేకమైనది. అమూల్యమగు ప్రాచీనవైద్య
వాఙ్మయమునందు చాలభాగము నశించినది. నిలిచియున్న
దానినైన నిప్పటివారిలో చాలమంది నిశ్చయమగు శాస్త్రా
భ్యసనాభిమానముతో చదువుటలేదు. స్థిరతత్వములును బహు
కాలమునుండి యాదరింపబడుచున్న చికిత్సా యోగముల
(Recipes) లో రోగములకు చికిత్సచేయు విధానములును

నిలిచియుండకున్నచో ఇదివరకు తటస్థించిన ప్రాణాపాయస్థితిలో నాయుర్వేద మీసరికే నశించియుండియుండును. కావున సంస్కరణావశ్యకత ప్రబలముగ నున్నదను విషయమును మనము స్పష్టముగ గ్రహింపవలెను మన శారీరవిభాగ శాస్త్రము (Anatomy) శారీరము (Physiology) లొకప్పుడు సంకుచితములుగ (Comprehensive)నుండియుండినను ప్రస్తుతమవి యిట్టిస్థితియందు లేవుగాన వానిని పూర్తిగామార్చి వానికి మరికొన్ని విషయములను చేర్పవలసిన యావశ్యకతకలదు. మన రసశాస్త్ర వృక్షశాస్త్రములు వెనుక పాశ్చాత్యశాస్త్రములను మించియుండినను నేడు ప్రస్తుతకాలమునందలి మహోన్నత శాస్త్రీయస్థానానుగుణ్యముగ మనము వానికి నూతనాకృతుల నొసంగవలసియున్నది. శస్త్రచికిత్సయందు మనము పూర్వము చాలయభివృద్ధిని బడసియున్నను నేడుచాల వెనుకబడియున్నాము. ప్రాచీనకాలమునందు మన విద్యాభ్యసన విధాన ముత్తమోత్తమముగ నుండియుండినను నేడు సోమరిపోతులును ఔషధమిశ్రకులును (కంపౌండరు) చాలవరకు కవిరాజులమని వైద్యులమని పేర్లుపెట్టుకొనునట్లు చేయువిధానము చాల విమర్శనార్హమని ఘంటాపథముగ నుడువుటకు మనము జంకరాదు. మందులు (Medicine) మందులుజేయు విధానము (Pharmacy) అను నీరెండు శాఖలలోను మన మిప్పటికిని ప్రాచీనగౌరవాదులు భీరుబోకుండ శ్రేష్ఠముగ పనిచేయుచున్నా



మని యుప్పొంగుటయు సహజముగాదు. కాని మన గ్రంథములలో నుదహరింపబడిన యౌషధముల ప్రాశస్త్యములు లోకమునకు విదితము చేయుటకు మనము చాల కష్టపడి పనిచేయవలసియున్నది. అందులకు మనము పాశ్చాత్య దేశీయులవలెనే ఆ యౌషధములనుగూర్చి ప్రత్యేకపరిశోధనములనొనరించి వానిని నూతనాన్వేషణము లట్లొనరింపవలెను. మనకిదివరకు కలిగిన నష్టమును మనము మరల పూర్తినొందింపవలెను. మహాపండితుడైనను శుష్కించి ఆహారసంరక్షణములకు జ్యేష్ఠసుతుని నాశ్రయించు తండ్రిస్థితిలో నిపుడాయుర్వేద మున్నదనిన మీరు బాగుగా గ్రహింపగలుగుదురు. తండ్రి వృద్ధుడును రోగపూరితుడు నైనంతమాత్రమున నాతనియందు విజ్ఞానబలము లింకను నిలచియుండగనే ఆతని హింసింపవలెనని ఎవ్వరైన సూచింప సాహసింతురని నేను తలంపను.

ఇది అభిప్రాయము (Sentiment) తో సంబంధించిన ప్రశ్న కానేకాదు. ఒకొక్క సమయమున కొన్ని దీర్ఘవ్యాధులకు చికిత్స చేయవలసి వచ్చినపుడు పాశ్చాత్య వైద్యవిధానమునందలి నిదానము (Pathology), అణుక్రిములను గురించిన శాస్త్రము (Bacteriology), చికిత్స (Medicine) యందుగల బహుళయంత్ర సమృద్ధియంతయును మాంద్యము (Inert) గా నుండుట కనబడుచున్నది. అట్టిచో నట్టివ్యాధులను ప్రాచీనులు విధించిన వంశపరంపరాగతములగు నౌషధముల(Recipes)తో

ప్రాచీన అశాస్త్రీయ వైద్యవిధానజ్ఞులగు వైద్యులును కవిరాజులునే అట్టి ప్రబలవ్యాధులను కుదుర్పగలుగుచున్నారను ముఖ్యవిషయమును పాశ్చాత్య వైద్యశాస్త్ర పారంగతులగు భారతశ్రేష్ఠులు తెలిసియుండుట యావశ్యకము. అట్లు తెలిసిన వారు దురభిప్రాయమునువదలి సరళభావముతో పరిశోధింపవలెనని యథార్థమగు శాస్త్రీయశక్తి యాజ్ఞాపించుచున్నది. దేశీయములగు నోషధుల సత్వమును గ్రహించుటకు విదేశీయులును వారిమార్గము ననుసరించు దేశీయులును పరిశోధనల నారంభించుట శుభసూచకమే. దీనివలన నౌషధములనుచేయుటనుగూర్చిన శాస్త్రము (Pharmocopœa) సమృద్ధము కాగలదు. మరియు నదియభివృద్ధిం (Pamper) జెందును. కాని భారతీయ చికిత్సావిధానమును దెలుపు ఆయుర్వేదమునకు కలుగు లాభమేమియు లేదు. అది మరికొంత క్షీణించుట గూడ తటస్థించును. ఇట్టి ప్రాణాపాయస్థితిలో మనము మిన్నక తటస్థభావముతో చూచుచుండవలసినదేనా ?.

— ఆయుర్వేదము పునరుద్ధారణము ప్రారంభమగుట. —

ఆయుర్వేదవైద్యు లిదివరకే పునరుద్ధారణమునకుగడంగి చక్కనిపనిని చేయుచుండుట చాల సంతోషప్రదము. గత 10 వత్సరములనుండియు నీయుత్సాహము ప్రబలినది. దీనిఫలితముగనే యఖిల భారతాయుర్వేద మహాసభ ఏర్పడినది. ఇదివరకేడు వార్షికసభలు జరిగినవి. ఈ మహాసభకు స్థాయిసంఘ



ముగ నాయుర్వేద మహామండలియనుపేర ప్రతినిధి సంఘమొకటి యేర్పరుపబడినది. ఈ మండలికి సభ్యులను ప్రతివార్షిక సభలోను నియోగించెదరు. వారు సంవత్సరము పొడుగునను పని చేయుచుందురు. ఈ మండలివారి యాజమాన్యమున నేర్పడిన యఖిలభారతాయుర్వేద విద్యాపీఠము దీనితోపాటుగనే పని చేయుచున్నది. ఈదేశమునందు కలకత్తా, డక్కా, చెన్నపురి, పూనా, బొంబాయి, అహమదాబాదు, అజ్మీరు, లాహోరు, ఢిల్లీ నగరములను పరీక్షాస్థానములుగ నేర్పరచి యీ సంఘమువారేకకాలమున ప్రతివత్సరమును పరీక్షలను జరిపెదరు. ఇందులకు ఆయుర్వేద వైద్యశాస్త్రజ్ఞులలో నుత్తములును విశ్వసనీయులునగువారిని పరీక్షకులనుగా నియమించెదరు. మరియును స్థానికముగ ఆచరణభాగమున కర్మపథమున (Practical) గూడ పరీక్ష జరుపబడును. సంఘమువారు పఠనీయ గ్రంథములను నిర్ధారణచేసి రసశాస్త్రము శరీరవిభాగశాస్త్రము (Anatomy) శారీరము అగదతంత్రము లేక విషచికిత్స (Toxicology) మున్నగు వానినిగూడ పఠనీయములుగ విధించి సంపూర్ణమగు నూతనవిధానము నేర్పరచిరి. ఈరీతిగా నభ్యసించిన యాయుర్వేదవైద్యులు ఆయుర్వేదవైద్యమున కధికగౌరవస్థానమును సమకూర్పగలుగుదురు. పరీక్షలు ప్రజలలో చాలశీఘ్రముగ వ్యాపించుచున్నవి. విద్యాబోధనమునకు తగినయేర్పాటు లింకను బాగుగచేయబడినచో నీపరీక్షలింకనుగూడ నధికముగ

వ్యాపింపగలవు. ఆయుర్వేదకలాశాలల సంఖ్యగూడ నానాటికి హెచ్చుచున్నది. చెన్నపురిలో నొకశ్రేష్ఠమగు కళాశాలగలదు. దీనికి వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు కార్యనిర్వాహకులుగనున్నారు దీనికిచేరి యొకధర్మవైద్యశాలకూడగలదు. బొంబాయిలో డాక్టరు పోపటు ప్రభురాంగారి పరిపాలనక్రింద నొక కళాశాలకలదు. డాక్టరుగా రహర్నిశములు తమసర్వస్వమునా కళాశాలకొరకే వినియోగించుచున్నారు. జయపురము మహారాజావారి కళాశాలలో నాయుర్వేదశాఖలో చాలమంది విద్యనభ్యసించుచున్నారు. ఆశాఖకు ఆయుర్వేదాచార్యపండిత లక్ష్మీరామస్వామిగారు మున్నగువారు పలువు రుపాధ్యాయులు గలరు. పూనాలో శ్రేష్ఠమగు నాయుర్వేద పాఠశాలగలదు. దీనిభారమునంతయును పండిత కృష్ణశాస్త్రీకవడే. బి.ఏ. గారు వహించియున్నారు. తిరువాన్కూరునందును మైసూరునందును దొరతనమువా రేర్పరచిన ఆయుర్వేద కళాశాలలుకలవు. ఆ కళాశాలలలో పట్టములను బడసినవారిని ప్రత్యేకవిద్యాభ్యాసమొనర్చుటకు దొరతనమువారు వారికి విద్యావిరాళములిచ్చి హిందూదేశమునందలి వివిధాయుర్వేద స్థానములకు బంపుచున్నారు. లాహోరులోని దయానంద ఆంగ్లో వెర్నాక్యులరు కళాశాలలో పంజాబు విశ్వవిద్యాలయమువారి ధనసహాయమును బడయుచున్న ఆయుర్వేదశాఖ కలదు. ఇది బాగుగా పనిచేయుచున్నది. దీనిని మరల సవరించి నూతన ప్రస్తుతకాలా



జ్ఞాత వస్తునిచయమునుగూడ చేర్చెదమని ప్రిన్సిపలుగారి లేఖవలన తెలియుచున్నది మరియును సంయుక్త రాష్ట్రములందలి ఫిలిఫిత్ లోనున్న లలితారీ ఆయుర్వేద కళాశాలయును డిల్లీలోని బనవారీలాలు ఆయుర్వేద పాఠశాలయును నూతనాయుర్వేద కళాశాలయును కాంగేరిలోని గురుకులాయుర్వేద పాఠశాల మున్నగునవియును యథాశక్తిని బాగుగా పనిచేయుచున్నవి. బంగాళమున నొకటి రెండాయుర్వేద పాఠశాలలుగలవు. కాని అవి శ్రద్ధగాపనిచేయుటలేదు. అయినను ఇచట ఆయుర్వేదము పల్లెకూటపుపద్ధతియందును, ఉమేజువారుచేయు పద్ధతియందును గొప్పకవిరాజుల (Tol and Apprentice Systems) వలన నేర్పబడుచున్నది. ఇచటనున్న సుప్రసిద్ధులగు కవిరాజులందరునుగూడ చాలమంది శిష్యులకు బోధించుచుండుటయేకాక వారికి విద్య సాంగమగువరకును అన్నవస్త్రములును బసలును ఇచ్చి యేండ్లతరబడిగ చెంతనుంచుకొని స్వయముగ విధానములగూడ నేర్పుచున్నారు. కావునహిందూదేశమునం దాయుర్వేద కలాశాల పాఠశాలలు లేవని కొందరు చేయుచున్న వాదమున కాధారములేదు.

ఏడుభాషలలో 50 ఆయుర్వేద పత్రికలు ప్రతిమాసమునందును ప్రకటింపబడుచున్నవి. ఇటీవల వైద్యప్రపంచమునకు గోచరించిన నూతనవిషయముల నన్నిటినిగూడ నీపత్రికలవగతముచేసికొని విస్తరింపచేయుచున్నవి. అఖిల భారతా

యుర్వేద ప్రదర్శనములు ప్రతిసంవత్సరమునందును మహా సభలవారివలన జరుపబడుచున్నవి. వీనివలన నూతనౌషధులను గుర్తించుట ఉపయోగించుట మున్నగు విషయములు నానాటి కధికముగ తెలియగలుగుచున్నాము. నూతనగ్రంథము లధికముగ సంపాద్యములగుచున్నవి. దేశీయ వైద్యమునకు సంబంధించిన వనౌషధుల నన్నిటిని సంగ్రహించి గురితించి వివరించుటకు దీక్షితులగు లెఫ్టనెంటు కర్నలు కే. ఆర్. కీర్తికరు ఐ.ఎమ్.ఎస్., ఎఫ్.ఎల్.ఎస్., మేజరు బి. డి. బాసూ ఐ. ఎమ్. ఎస్. గార్లు మున్నగు పండితులు చాలశ్రమపడి పని చేయుచున్నారు. శారీరవిభాగశాస్త్రము (Anatomy), శారీరధర్మశాస్త్రము (Physiology), నిదానము (Pathology), అగదతంత్రము (Toxicology), స్వాస్థ్యవృత్తము (Hygeine) మున్నగు విషయములనుగూర్చి ఆయుర్వేదవిద్యార్థుల కుపయుక్తములగునట్లు సంస్కృతము,మహారాష్ట్రము, హిందీ మున్నగు భాషలలో పఠనీయగ్రంథములను వ్రాయుచున్నారు. సంస్కృత గ్రంథములధికముగ వ్యయమగుట ప్రారంభమైనది. బొంబాయి వాస్తవ్యులును నిరంతరము పరిశ్రమమొనరించుటయందు దీక్షితులునగు పండిత యాదవజీ త్రివిక్రమజీగారు ఆయుర్వేదగ్రంథమాలయను శీర్షికక్రింద నాయుర్వేదములగూర్చిన యపూర్వగ్రంథములను ప్రకటించుచున్నారు. పూనాలో నానందాశ్రమ సంస్కృత ముద్రాలయమువారలు, మైసూరు తిరువాన్కూరు



దొరతనములవారలు, వంగదేశమునందలి ఆసియా సంఘమువారలు అమూల్య గ్రంథములను ప్రకటించినందుకు వందన సహస్రము లాచరించుచున్నాము.

—॥ హిందూ విశ్వవిద్యాలయమువారికి విజ్ఞప్తి. ॥—

ఇంతపని జరుగుచున్నను ఇంకను జరగవలసిన మహాత్కార్యము వంక పారజూచిన నిది చాలస్వల్పమని శోచకమానదు. ఆయుర్వేద పునరుద్ధారణమే తమ జన్మమునకు సాఫల్యమని తలంచి యముద్రితగ్రంథ సముపార్జనము కొరకు ప్రోత్సాహుల విషయము నెరింగినవారగు పండితులు దీర్ఘకాల సంచారమునకు గడంగవలెను. విదేశీయుల దండయాత్రల వలన దక్షిణహిందూస్థానమున కధికమగునష్టము కలిగియుండ లేదు గాన నాభాగమున నట్లు సంచారమొనరించిన నచట నమూల్యగ్రంథములు లభింపగలవు. శారీరచ్ఛేదన శాస్త్రము ననుసరించిన శరీరచ్ఛేదనలు (Anatomical Dissections) జంతుదేహధర్మశాస్త్రము ననుసరించి చూపుపనులు (Physiological demonstration) ప్రకృతిశాస్త్రము (Physics) ను, రసతంత్రమును (Chemistry) నేర్పుతరగతులు వీనిని నేర్పుటకు వలయు సర్వోపకరణ సముపేతములగు నాయుర్వేద కళాశాలలను ప్రతిరాష్ట్రమునందు నేర్పరచి వాని నీ విశ్వవిద్యాలయానుబంధములుగ నొనరింపవలెను. ఈ కళాశాలల కనుబంధములుగ దీర్ఘవ్యాధులకుచికిత్సచేయుటకు దగిన వైద్యశాలల నేర్పరుపవలెను. అట్లేర్పరచినచో నిదివర కేర్పరుపబడి

యున్న పాశ్చాత్యవైద్యశాలలు చేయుచున్న సత్కార్యమున కివి సహకారులుగ నుండగలుగును. ఆయుర్వేదవిద్యార్థులకు కర్మపథములను (Clinical Knowledge) ప్రత్యక్షముగ నత్యధికముగ వ్యాపించుటకు తగిన యీ ప్రతిష్ఠాపనములు తరగని జలముగల తేటనీటి యూటలై దనరారవలెను. దేశీయ వనౌషధులను పరిశోధించుటకును ఆయుర్వేద విధానమున నూతనవిషయములను కనుంగొనుటకును ప్రదర్శించుటకును నీ ప్రతిష్ఠాపనములయందు భాగములో నౌషధములను సిద్ధము చేయుటకును పదార్థములను విభజించుటకును తగిన రసశాలల (Pharmacological & Analytical laboratories) నేర్పరుపవలెను. అవి నిరంతరముగ పనిచేయుచుండవలెను. సహజవస్తుజ్ఞానము కలుగుటకును పరిశోధనమున కవకాశముండుటకును ఆయుర్వేదగ్రంథ భాండాగారములను తోటలను దేశీయవనౌషధి ప్రదర్శనశాలలను ఓషధిప్రస్థములను (Herberia) తగిన జాగ్రత్తతో నేర్పరచవలెను. ప్రస్తుతమునం దార్థికస్థితినిబట్టి యిదియంతయును దుర్భరకార్యమని తోచవచ్చునుగాని ఇవియన్నియును మన కాశయములుగ మనదృష్టిపథంబున నుండవలెను వైద్యశాస్త్రమునందు భారతీయవిజ్ఞానమును కేంద్రీకృత మొనరింపవలెనను దీక్ష మనకున్నచో వీని నన్నిటిని మన మేర్పరుపవలెననుట నిర్వివాదాంశము. ఈ దేశీయులును బాధితులునునగు కోట్లకొలది ప్రజల నీయాయుర్వేద మెన్ని శతాబ్దములనుండియో కాపాడినది. ఇప్పటికి నత్యధిక



ముగ కాపాడుచున్నది. కావున పాశ్చాత్యవిధానములవలన లభ్యములగు మెరుగులనన్నిటిని మనము దీనికి నిర్లోపముగ సంఘటించి సంపూర్ణ ప్రకాశ మొనరించి తమ కుపయుక్తముగ నొనరింపవలెనని ముక్కోటిప్రజలును మనలను కోరుచున్నారు. మన మొక మహత్తమమైన యాశాంకురమును కలిగించితిమి. విశ్వవిద్యాలయ భావిఫలితమునందు మనము సంపూర్ణవిశ్వాసమును కలిగియున్నాము. గాన నిట్టిభూతహిత మహోన్నత కార్యమునం దీ మహాశయమును స్థాపించుట విశ్వవిద్యాలయమునకు విధియైయున్నది.

సంస్థానాధిపతులయొక్కయు వదార్యులగు ధనికులయొక్కయు సహాయమువలననే యాయుర్వేదపాఠశాలలో నింతటి యుపయుక్తములగు పనులు జరుపబడుచున్నవిగాన యాశయానుగుణ్యముగ వానిని విస్తరింపజేయు భారముగూడ వారియందే యున్నది

—( దొరతనమువారికి విజ్ఞప్తి )—

ఆయుర్వేద విధానమున కుదారభావముతో సహాయముచేసి దానిని కాపాడుటకు ప్రభుత్వమువారును ప్రజలును గూడకలిసి పనిచేయుట కికనైన గడంగుట యత్యవసరము. హిందూదేశమునందు వైద్యావశ్యకత స్వల్పమును మితమును కూడగాదు. దేశమందలి జనసంఖ్య చాల హెచ్చుగానున్నది. దేశమందలి వైద్యులసంఖ్యను దీనితో బోల్చిచూచినచో నన్ని

దేశములకన్న హిందూదేశమునందే వైద్యసహాయము చాల తక్కువగుచున్నదని స్పష్టమగును. ఈదేశమందు కోట్లకొలది ప్రజలు సాలుపొడుగునను మన్యజ్వరములు, విసూచి, మహామారి, జ్వరములు, దీర్ఘవ్యాధులు మున్నగువానిచే బాధపడుచుందురు. వీరికి చికిత్సచేయు పాశ్చాత్యవైద్యులసంఖ్య మహాసముద్రమున తైలబిందువువలెనున్నది. 20000 మంది కొక వైద్యుడువంతున పాశ్చాత్యవైద్యు లీదేశమునగలరు. ఇది యతిశయోక్తికాదు. మన హిందువులకు జనాభాలెక్కలే ప్రమాణముగ నున్నది. పాశ్చాత్య వైద్యవిధానముతోపాటు ఆయుర్వేద విధానముగూడ యభివృద్ధినొందినగాని యీ రోగులకు బాధావిమోచనముకానేరదు. ఆయుర్వేదవనౌషధులు పుష్కలముగనున్నవి. వానికి కరవులేదు. యుద్ధమువలన వానిధర విపరీతముగ పెరుగదు. ఇట్టి దేశీయవనౌషధుల సహాయమున నెందరో యుదారభావులు మానముగా నిట్టి సత్కార్యమును చేయుచున్నారు. వారి నందుల నభినందించువా రెవ్వరును లేకున్నను వారుసేవను చేయుచునేయున్నారు. అట్టి వారిని ప్రోత్సహింపదగునుగాని నిరసించుట పాటిగాదు. ఏలయనిన వారి పతనముగాని వినాశనముగాని ఆశాభరితులై ప్రభుత్వము వారిదిక్కు చూచుచున్న కోట్లకొలదిగనున్న ప్రజలందరికిని గూడ పతనవినాశహేతువులేయగును.మనయదృష్టమున దయాశీలురగు మనపరిపాలకు లీవిషయమున నశ్రద్ధచూపుచున్నారు. అఖిలభారతాయుర్వేద మహాసభవారి విజ్ఞప్తికి వారిదివరకే



సమాధాన మొసంగియున్నారు. జగన్నాధమునందును ముజఫరు పురమునందును నేర్పరుపబడబోవు సంస్కృత కళాశాలలలో నాయుర్వేదముగూడ పఠనీయభాగముగ నేర్పరుపబడునని బేహారు ఒరిస్సారాష్ట్రముల దొరతనమువారిదివరకే యభయమిచ్చియున్నారు (నెం. 2596 ఇందున తేదీ 19-12-1911.) ఆయుర్వేద మహామండలి కార్యదర్శికి దొరతనమువారు వ్రాసిన లేఖ ఆయుర్వేదవార్షికగ్రంథమున(కాలెండర్సు) నిదివరకే ప్రకటింపబడినది. బొంబాయి మెడికల్ రిజిస్ట్రేషనుఆక్టు నిబంధనల ననుసరించి పూనాలోని ప్రాచీన ధర్మాయుర్వేద వైద్యశాలను దొరతనమువా రెత్తివేసిరిగాని మా విజ్ఞాపనముపైని దానిని మరల ప్రారంభించిరి. చెన్నపురిలో డాక్టరు కృష్ణస్వామయ్యరుగారి కేసు అనుకూలముగనే పరిష్కరింపబడినదిగాని కొంతయంశము విడువబడినది. (దాని ఫలితమింకను నిర్ధారణ కావలసియేయున్నది). ఇట్లు దొరతనమువారు పలువిధముల ననుగ్రహముల జూపినందుకు వందనము లాచరించుచున్నాము. గాన కాలక్రమమున భూతహితార్థము ఆయుర్వేదము పునరుద్ధారణమునకు మనము చేయుచున్నపనియందు కరుణామయులగు మన దొరతనమువారుగూడ నత్యధికమగు సానుభూతినిచూపి యీ మహాత్కార్యమునకు దోడ్పడుదు రనియే మనము విశ్వసించెదము.

---

శ్రీమద్ధన్వంతరయేనమః.

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

మాచే సంప్రదాయానుసారముగ వ్రాయబడి ముద్రితములై

క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

☞ *శాశ్వత చందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగత పుస్తకములు 100-కి 25-ర్పూ. తగ్గించి ఇవ్వబడును.

1. మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్రి వ్యాఖ్యాయుతము. రోగనిదానాదులం దెలుపు గొప్ప వైద్యగ్రంథము. వెల ... ... 3 0 0
2. పథ్యాపథ్యము - సంస్కృతము. విశదమగు తెనుగు తాత్పర్యముం వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను దెలుపును. వెల ... 1 0 0
3. ఆయుర్వేదపరిభాష - అనేకగొప్ప ఆయుర్వేదగ్రంథములనుండి సంగ్రహింపబడినది. సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయు వారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... ... ... 1 8 0
4. అగస్త్యవైద్యము - దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగువచనము. వెల ... 0 4 0

---

*ఇంతవరకు ముద్రితములును నికమీద ముద్రింపంబోవు గ్రంథముల నన్నిటిని గ్రహించువారు శాశ్వతచందాదారులుగ నెన్నబడుదురు.



5. ఆయుర్వేదాంగశల్యతంత్రము - ఆయుర్వేదమున శస్త్రచికిత్స నెట్లు కనుగొనినదియు దానినభ్యసించు మార్గములను బోధించు తెనుగువచనము వెల ... 0 4 0
6. వస్తికర్మము - "పిచికారి" యొక్క స్వరూపమును దాని నుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెనుగు వచనము. వెల ... ... ... 0 4 0
7. అర్కప్రకాశము - ప్రతిమూలికనుండియు "అరఖుల" దీయుట కుపాయములను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుసరించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్రి వ్యాఖ్యానము వ్రాయబడియున్నది. వెల ... ... ... 2 0 0
8. భేషజకల్పము - వైద్యప్రక్రియలను తెలుపు సుప్రసిద్ధ ఆంధ్రిపద్యకావ్యము. అతి విపులమగు నాంధ్రి వ్యాఖ్యానము కలదు. వైద్యులుమాత్రమే గాక ప్రతి యాంధ్రుడును చూడదగినయుత్తమగ్రంథము, వెల... 1 0 0
9. రసప్రదీపిక - రసతంత్రప్రక్రియలను బోధించు సుప్రసిద్ధమైన తెనుగు పద్యకావ్యము. రసార్ణవాది గ్రంథముల సహాయముచే తేటతెనుగున తాత్పర్యము వ్రాయబడినది. ఇందు తెలుపబడియుండు లోహాదిధాతువులకు ఇంగ్లీషు పేర్లు చూపబడియున్నవి. వెల ... 1 8 0
10. ఆయుర్వేదచరిత్రము - ఆయుర్వేదము అందలి విషయములు మొదలగువానిని విపులముగ చర్చించు తెనుగు వచన గ్రంథము. వెల ... ... 0 4 0

11. అధ్యక్షకాభిభాషణములు—"బొంబాయి" "కొల్లంగోడు" లలో జరిగిన ఆయుర్వేద వైద్యమహాసమ్మేళనమునయిచ్చిన ప్రధానోపన్యాసములు. ఇందు ఆయుర్వేద వైద్యక విషయములును, అందలి గ్రంథములును ఆయాదేశములయందు వైద్యాభివృద్ధియును రాజకీయ వైద్యకశాసనమును విపులముగ విమర్శించబడినవి. ... 0 6 0

12. ఆంధ్రదేశము - వైద్యసహాయము. వెల ... 0 1 0

13. హిందూవిశ్వవిద్యాలయము - ఆయుర్వేద ప్రశస్తి - ఇది మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్ ఎం. ఏ. ఎల్. యం. ఎస్. గారిచే ఆంగ్ల భాషయందు వ్రాయబడినది. వెల ... 0 4 0

14. పైదానికి ఆంధ్రమున పరివర్తితము - ఇందు ఆయుర్వేదము ఆధారరహితమగు శాస్త్రము గాద (Scientific) నియు త్రిదోషతత్వపినిశ్చయము మొదలగు విషయములు చక్కగ విమర్శింపంబడినవి. వెల... 0 6 0

15. హిందూవిశ్వవిద్యాలయము-గత నూరుసంవత్సరముల కాలములోని వైద్యాభివృద్ధి. ఇది లెఫ్టనెంటుకర్నల్ కే.ఆర్.కీర్తికర్.ఎఫ్.ఎల్.యస్. ఐ.ఎం.ఎస్.(రిటైర్డు) గారిచే ఆంగ్లభాషయందు వ్రాయబడినదానికి ఆంధ్రమున పరివర్తితము. ఈగ్రంథనామము జేతనే నిందలివిషయములు సర్వజనసుబోధితము. వెల 0 6 0

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఎ. వి. ఎస్., ఎ. ఎం. బి.

టెలిగ్రాఫ్ అడ్రసు, "పండిట్" మదరాస్.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలా ఆఫీస్,

నెం. 55, ఆచారప్పన్ వీధి, జి.టి. మదరాస్.

# చెన్నపురి ఆయుర్వేదకలాశాల.

ఆయుర్వేదమును లక్ష్యలక్షణములతోడను పాశ్చా
వైద్యమందలి అనాటమీ ఫిజియాలజీ మొదలగు వానితో
గర్పబడును.

ఇందు "ఆయుర్వేదభూషణ" అను సంస్కృతశాఖ
"భిషగ్వర" అను ఆన్ధ్రశాఖయను రెండుశాఖలు గలవు.

సంస్కృతశాఖకు నాటకాంతి సంస్కృతజ్ఞానము
వారుగ నుండవలెను.

ఆన్ధ్రశాఖకు తెనుగున మంచి భాషాజ్ఞానము గ
యుండవలెను.

విద్యార్థులు **16** వత్సరములకు తగ్గకను **24** వత్సరము
లకు మించనివారుగ నుండవలయును.

కలాశాలయందు జేరగోరువారు అక్టోబరుమా
మునకు దరఖాస్తులను బంపుకొనవలెను.

వివరములు గోరువారు కలాశాలాధ్యక్షులకు వ్రాసి
దెలుసుకొనవచ్చును.

ఆయుర్వేదకలాశాల,
మదరాస్.

వైద్యరత్న పండిత. డి. గోపాలా
ఎ. వి. యస్., ఎ.
ప్రిన్సి

